శ్రీ సాయీ నిలయము ప్రచురణము - 10



# శ్రీ సాయీ సుభాషితములు



. శే. శ్రీ బాపట్ల హనుమంతరావు పంతులు

ప్రచురణకర్త : బాపట్ల వేంకట పార్థసారథి
శ్రీ సాయీ నిలయమ్, చెరువు (P. O.)
PIN. 522 113

మొదటికూర్పు
1000 ప్రతులు

ఏతదావలంబనం శ్రేష్ఠ మేతదాలంబనం పరమ్
ఏతదాలంబనం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్యతత్.

శాస్త్ర గురు బోధలను మఱి స్వానుభవము
కలిమి నెద్దాని నరుఁ డేఁడుగడఁగ నమ్మ
నదియె శ్రేష్ఠంబుఁ బరమమౌనదియ, యదె జ
గంబునన్ వాని కవలంబనంబు, సాయి!

మూల్యము రు. 8-00.

ముద్రణ :
పి. ఆర్. కృష్ణమూర్తి,
వెల్‌కమ్ ప్రెస్ ప్రైవేట్ లిమిటెడ్,
లెస్సీస్ శ్రీవిజ్ఞానమంజూష, గుంటూరు-2.

ఓమ్

శ్రీ సాయీ సద్గురవేనమః



# శ్రీ సాయీ సుభాషితములు







సాయి కల, డెంతు సాయిని,
సాయీతో నుందు, మనుదు సాయీ కొఱకై,
సాయీ వలన స్థితి; దాసుఁడ
సాయికి, గతి సాయియంద, సాయీ! కనవే!

రచయిత

శ్రీ. శే. బాపట్ల హనుమంతరావు పంతులుగారు

# ఆశీస్సు

ఓమ్

శ్రీరామ సాయి శరణం మమ

కీ. శే. పూజ్యశ్రీ బాపట్ల హనుమంతరావు పంతులుగారి రచనలందు ప్రచురించబడిన వన్నియు చదివితిని. వారి కవిత్వములోని మాధుర్యము యెటువంటి కఠిన హృదయుని గూడ ఆకర్షించి ముగ్ధుని చేస్తుంది. వారి భావములన్నియు ఆచరణలో పెట్టి చూపిరి కనుకనే శ్రీ సాయీ భక్తులనెల్లరను వారాకర్షింప గలిగిరి. "శ్రీ సాయీ అనుసరణము" పఠనప్రభావమువల్ల నాకును నా సహచరులు కొందరికిని తలవని తలంపుగ షిర్డి పుణ్యక్షేత్రము దర్శించి, శ్రీ సాయీనాధు నారాధించు భాగ్యము సంప్రాప్తమగుటయేగాక, నాకు గలిగిన ఆధ్యాత్మిక సంబంధమగు సందేహములన్నియు తొలగి, ఆత్మానందము, మానసిక ప్రశాంతత సిద్ధించినది. రచయితగారు అధిదేవతా లోకానుబంధము గలవారనుట అతిశయోక్తి కానేరదు. వారు గొప్ప Constructed Gentleman. వారి రచనలు స్వానుభవమువల్ల వ్రాసినవేకాని ప్రచారణకొరకు వ్రాసినవికావని నా అభిప్రాయము. వారి అనుభవములు మానవత్వముగల ప్రతివాని మనస్సును కలచివేసి, పరమానందమును కలిగించును. వారి రచనలు చదువుతూ ఒక్కపర్యాయము సాయీ ప్రభువుని అంతర్యములో తలచిన ఆ బాబు అభయహస్తముతో ప్రత్యక్షముగ ఎదుట యున్నట్లే స్ఫురిస్తుంది. అదే సచ్చిదానందము. అంతకు మించిన ఆనందములేదు. ఈ ఆనందములోనే భౌతిక విషయములు మరపునకు వచ్చి ఆ స్థితిలో వున్నట్లు గోచరించును. ఈ రచయితగారికి నా మనఃపూర్వక నమోవాకములు సమర్పించుకొను చున్నాను. ఇట్టి సత్కృతులనుభక్తజనుల కందించు శక్తిసామర్థ్యములను, ఆయురారోగ్యములను యీ ప్రచురణకర్తకు సాయీ ప్రభువు ప్రసాదించు గాక !

సికిందరాబాదు,
6–10–1979.

ఇట్లు,
పిల్లలమర్రి విశ్వనాథం, సాయీ అణువు.



"నేను కృతకృత్యుఁడను, ధన్యుఁడేనయగుదు;
హిత సముద్ధృతిఁ గనిరి నా పితరులెల్ల
సాయి నాథుండు నిజభక్తి సహితుఁడగుచుఁ;
జేరి నా కుటీరమున వసించు కతన".

(రచయిత 4-2-1960)



ద్వారకామాయి శ్రీసాయి వాంఛితంబో !
పూర్వజన్మార్జిత విశేష పుణ్యఫలమొ !
తొలిపలుకు గూర్చి, తమిఁబోషకులను జేర్చి,
తోడుపడె నచ్చుఁగూర్పగ **తుర్లపాటి**
**బాలగురునాథుఁడి** తఁడ్రీ సుభాషితములు.

# తొలి పలుకు

ఓమ్

శ్రీ సమర్థ సచ్చిదానంద సద్గురు సాయినాథ మహారాజునకు జయము.

ఏ విషయమునకైనా మార్గదర్శకుడు అవసరము. ఆ మార్గదర్శకుని గురువని వ్యవహరిస్తారు. ఇహలోక సంబంధమగు అనేక విషయములకు మార్గదర్శకులనేకులుంటారు. కానీ భగవత్సంబంధిత విషయములలో గురువులసంఖ్య స్వల్పము. గురువులు ఎందరుండినా సద్గురువులు చాలా కొద్దిమందే వుంటారు. అలాంటి సద్గురువును సమాశ్రయించినవారు దేనికొరకైనా ఆరాటపడనవసరముండదు. వారు చేయవలసినదల్లా, తనను సంపూర్ణముగా సద్గురువున కంకితమొనరించుకొని, వారి ఉపదేశములను ఆచరణలోనికి దెచ్చుకోవడమే : అలాంటి శిష్యులశ్రేయస్సును పరిరక్షిస్తూ, వారికి చెందవలసినదాని నందిస్తూ, వారిని చేర్చవలసిన స్థానమునకు జేర్చడం, సద్గురువు తన బాధ్యతగాగ్రహిస్తాడు. "గురువే బ్రహ్మ, విష్ణువు, శివుడు, పరబ్రహ్మ" యని గురుమంత్రం చెబుతుంది. అంటే శిష్యునికి తన సద్గురువును దప్ప యితరము నారాధించవలసిన అవసరం లేదు. అలా మనస్సులో అనిపించినప్పుడే శిష్యునికి జ్ఞానోదయమౌతుంది.

"మానవశక్తి పరిమితము, దైవశక్తి అపరిమిత" మని దెలుసుకొని, ఆ దైవాన్ని దెలుసుకొని తరించాలని తపించే భక్తులందరికీ శ్రీ సాయీ ప్రభువు మార్గదర్శకుడు. దాదాపు 120 సం॥ల నుండియూ సకల దేవతాస్వరూపుడుగా, సకల సద్గురు స్వరూపుడుగా సర్వాంతర్యామిగా కీర్తించబడుచున్న సాయి సర్వ సమర్థులు. శ్రీ సాయి సశరీరులుగా నున్నప్పుడు తనవద్దకేతెంచిన భక్తులెందరికో సందర్భాను సారముగా యొసంగిన సలహాలనే "శ్రీ సాయీ సూక్తులు" గా భక్తులు పరిగణించుచున్నారు.

ఒక కులమునకు గానీ, మతమునకు గానీ, దేశమునకు గానీ, భాషకు గానీ కట్టుబడియుండక, సర్వమున కతీతుడై భిన్నమతములవారినీ, సంస్కృతులు గలిగిన వారినీ ఒకచోట జేర్చి తను ఆచరించే విధముగనే తన భక్తులనందరినీ ఆచరించమనీ నిజమేదో దెలుసుకోమని ఉపదేశించినాడు శ్రీ సాయి. అందులకే శ్రీ బాబా భక్తులలో అన్ని మతములవారునూ, కులములవారునూ, దేశవిదేశములలో ఎందరో గలరు.

సర్వమత సామరస్యమును మానవుల మనస్సులలో నెలకొల్పిన శ్రీ సాయి, ఆడంబర ఆర్భాటముల కేనాడూ తావొసంగలేదు. పరమతసహనము, ప్రేమ, అభిమానముల పెంచి ఈర్ష్య, అసూయలను ప్రజల మనస్సులనుండి పారద్రోలగల్గిన మహాత్ముడు శ్రీ సాయి.

ప్రతి ప్రాణిలోనూ తానున్నానని తనభక్తులకు నిరూపించి, వారి మనస్సులలో భూతదయ, అహింస మొదలగు సద్గుణములను పెంపొందించి, శ్రీ సాయి ఏదో ఒకరూపములో తన చెంతనే వున్నాడనే భావనను తన భక్తునికి కల్గించుచూ కరుణామయుడై లోకకల్యాణ మొనరించుచున్న పరమాత్మ శ్రీ సాయి.

తనకన్నీ దెలిసినా, తానే సర్వాంతర్యామియైనా, ఏమియూ దెలియని సామాన్య ఫకీరువలె భిక్షాటనముచే జీవించి, వర్ణాశ్రమ ధర్మములను త్రికరణ శుద్ధిగా ఆచరించాలని తన భక్తులకు సూచించారు. తను నిరహంకారులై తన భక్తులు కూడా అహంకార రహితులుగా నుండాలని బోధించారు.

తనను త్రికరణశుద్ధిగా విశ్వసించి, స్మరించినచో, బాధ్యతలనెల్ల తానే భరించి, తగు సహాయముల నందజేయుచూ, సలహాల నొసంగుచూ కంటికి రెప్పవలె కాపాడగలనని అభయమొసంగి తనభక్తులను సదా అనుగ్రహించుచున్న శ్రీ సాయీ ప్రభుని ప్రేమాభిమాన వాత్సల్యములు శ్రీ సాయి పదాశ్రితులందరు అనుభవించు చున్నవే!

నియమ, నిష్ఠలు, మంత్రానుష్ఠానములూ అనవసరమనియూ, ప్రగాఢ మగు విశ్వాసము (నిష్ఠ), ధైర్యోత్సాహములతో కూడిన ఓర్పు (సబూరి) లను కలిగియుండిన చాలనియూ దెలిపిన బాబా భక్తసులభుడు.

ఎవడు సదా "సాయి సాయి" యనెడి నామమును భక్తితో స్మరించు చుండునో, ఎవడు తనకు అర్పించక దేనినీ భుజించడో అట్టివానికి తాను బానిసయై వాని యోగక్షేమములను విచారించుచుందునని శ్రీ సాయి యొసంగిన వరము ఈనాటికీ భక్తులెందరికో నిత్యానుభవమే! శ్రీ సాయి ఉపదేశములను ఆచరణలోనికి దెచ్చుకో గలిగిన భక్తులు ధన్యులు.

దేశకాల పరిస్థితులమబట్టి భగవానుడు భక్తుల నుద్ధరించుటకొరకై మానవ రూపమును ధరించుచుండు నెందురు. సమర్థ రామదాసస్వామి, కబీరు, రామకృష్ణ

పరమహంస, అక్కల్‌కోట మహరాజ్, శ్రీ సాయి బాబా, రమణమహర్షి మొదలగు సిద్ధపురుషులందరూ భగవదవతారములుగా గుర్తించబడి కీర్తింపబడుచున్నారు. సద్గురువుల నాశ్రయించు భక్తులలో భేదభావములు పొడజూపవచ్చునేమో గానీ, సిద్ధపురుషులందరూ తమలో తాము ఒకరికంటే మరొకరు వేరనే దృష్టిని కలిగియుండరనే విషయం. మహాత్ముల జీవితచరిత్రలనూ, బోధనలనూ పరిశీలించిన దెలియగలదు.

శ్రీ సాయీశుడు పూర్వజన్మమున కబీరుగా నుండెనని భక్తుల విశ్వాసము. శ్రీ సాయి నామావళిలో "శ్రీ కబీర్దాసావతారాయ నమః" అని వుండడాన్ని బట్టి పై విషయం నిర్ధారించబడుచున్నది. తానే శ్రీ సమర్ధ రామదాసస్వామి, అక్కల్‌కోట మహరాజ్. దత్తాత్రేయాది పరమాత్మ అవతారములని ఆయా భక్తులకు నిదర్శనముల నిచ్చుటయేగాక, సద్గురువులందరూ తానేయని నిరూపించినారు. శ్రీ సాయీ కబీరుసూక్తులను ఆచరణలోనికి దెచ్చుకోగలిగినవారు సత్ఫలితముల నందగలరనుటకు, కబీరు శిష్యాగ్రగణ్యులగు శ్రీ భద్రాచల రామదాసస్వామి వారి చరిత్రయే తార్కాణము.

"భగవన్నామము నుచ్చరించుచూ, చేతులుచరచుచూ భజన జేయుచుండినచో, శరీరము, వాక్కు, మనస్సు, వాతావరణములు పవిత్రములగు" నని శ్రీరామకృష్ణ పరమహంస గురుదేవులవారు ఉపదేశించిరి.

అలాగే శ్రీ సాయి కూడా తాను శిరిడీజేరిన తొలి రోజులలో ద్వారకామాయిలో సదా భగవన్నామ సంకీర్తనలచే, కాలము గడుపుచూ భక్తిపారవశ్యముచే నృత్యములు జేయుచుండెడివారట. ఆ తర్వాతికాలములో భగవన్నామ సంకీర్తనలను హరికథలను, పురాణపఠనములను విశేషముగా ప్రోత్సహించిరి. సదా భగవన్నామ స్మరణ, మననముల వలన చంచలమగు మనస్సు స్థిరత్వమునొందుననియూ, తద్వారా భక్తుడు దేనినైననూ సాధించగలడని మహాత్ములు పలికిన పలుకులకు సార్థకత నొసంగిన శ్రీ సాయీ రాముడు సంగీత సాహిత్యస్వరూపమే !

శ్రీ సాయిని అనేక రూపములుగాదలంచి అర్చించడంవలన, శ్రీ సాయియే సర్వమనే భావన పాదుకొని, సదా శ్రీ సాయితో మానసిక సాన్నిహిత్యము ననుభవించే అవకాశము భక్తులకు కలుగుతుంది. దానివలన కలిగే తృప్తి, ఆనందము అనిర్వచనీయములు.

శ్రీ సాయి సశరీరులుగా నున్నప్పుడు అనేకులు బాబాను చేరి తమ కష్ట సుఖములను చెప్పుకొని యిహలోకసంబంధమగు కోర్కెలనుదీర్చమని ప్రార్థించుచూ అనుగ్రహింపబడుచుండెడివారు. "ముక్తి, భక్తి, విరక్తులను ప్రసాదించగల పరమాత్మను కేవలం అశాశ్వతమగు కోర్కెలను గోరడం సముచితముకాదని వారించబోయిన యొక భక్తుని, శ్రీ సాయి "వేదనలలోనున్నవారు తమ మనస్సును భగవానునిపై నిలుపజాలరు. తమ వేదనలు నిర్మూలమైనప్పుడే వారికి భక్తి గలిగి, భగవానుని ధ్యానించగలరు. కాబట్టి వారిని వారించకు. వారు కోరినదెల్లా వారికికావలసినంతవరకు యివ్వడమే నా స్వభావమని" అన్నారు. అతి చిన్న విషయము నుండి ఎంత జటిలమైన సమస్యనైనా పరిష్కరించగల శ్రీ సాయి అపార కరుణాసింధువని భక్తుల ప్రగాఢ విశ్వాసము.

శ్రీ సాయి తన భక్తులను అనేక విధములుగా, విచిత్రముగా తనవద్దకు లాక్కుంటారు.

1971 వ సంవత్సరములో నా మిత్రుడొకడు ఒక కార్డుమీద "శ్రీ సాయీనాథాయ నమః" అని 18 సార్లు వ్రాసి, అలాగే కొన్ని కార్డులమీదవ్రాసి యితరులకు పంపించమనీ, దానివలన మంచి జరుగుతుందనీ నాకు తెలిపినాడు. కానీ దానిని మూఢనమ్మకముగా భావించి అలాచేయక, దాని విషయమే మరచిపోయాను.

నా జీవితములో శ్రీ సాయిబాబాను పరీక్షించడం, విశ్వాసం బలపడటం 1972 లో జరిగింది.

నా మిత్రుని బంధువుల ద్వారా "శ్రీ సాయిని నమ్మి ప్రార్థించెడి వారి కోరిక ఎటువంటిదైనా, దానిని ఆ తండ్రి తీర్చునని" తెలుసుకున్న మరునాడే ఏదో ఒక పనిమీద కడపకు వెళ్ళడం జరిగింది. నా మిత్రుడు వుండేదికూడా కడపలోనే కానీ అతని యింటి అడ్రసు నాకు తెలియదు. అతను పనిచేసే ఆఫీసులో అడిగినా లాభంలేకపోయింది. ఎక్కడున్నాడో, ఎప్పుడొస్తాడో ఎవ్వరూ చెప్పలేక పోయారు. నేను మరలా వేరొకచోటికి వెళ్ళవలసిన అవసరం తొందర పెట్టుండగా, అతని ఆఫీసుదగ్గరలో ఒకచోట కూర్చుని "ఇక 15 ని॥లలో నా మిత్రుడు కనుపించిన నీవు భక్తపరాధీనుడవని నమ్మగలను. లేకున్న నిన్నిక స్మరించనని" అనుకుని సాయినామమును జపించుచూ కూర్చున్నాను. 15 ని॥ లయింది. నా మిత్రుడు కనుపించలేదు. శ్రీ సాయికి నాయందు దయలేదోమో నని తలంచి బాధతోలేచి రెండ

డుగులు వేశానో లేదో ఎదురుగా నా మిత్రుడు రావడం కనుపించింది. నా ఆనంద మున కంతులేకపోయింది. బాబా శక్తి మొదట సారిగా నా కప్పుడు అవగతమయింది.

అప్పుడుగానీ నాకు నా మిత్రుడు చాలాకాలంక్రితం నాకు వ్రాసిన ఉత్తరం గురించి, 1958 లో మాయింటిలో నుండిన శ్రీ సాయి ఫొటోనుగురించి, "శ్రీ సాయి సకల దేవతా స్వరూపుడని" పూజ్యశ్రీ మానాన్నగారగు శ్రీ తుర్లపాటి శ్రీరాములు గారు దెలియజేసిన విషయాన్ని గురించి జ్ఞాపకానికి రాలేదు.

అలా శ్రీ సాయి "తనను స్మరించినవారి కోరికలెలాంటివైనా సరే తీర్చ గలననీ, ఎన్ని పరీక్షలకైనా నిలబడి తానే సర్వాంతర్యామినని నిరూపించగలననీ" అభయమొసంగి, ఈనాటివరకూ క్షణక్షణమూ అనేక విధముల తన లీలలను ప్రద ర్శించుచూ నన్ను తన పదాశ్రితునిగా జేసుకున్నారు.

తనను నమ్మినవారిని సమయానుకూలముగా రక్షించుచుందునని శ్రీ సాయి యొసంగిన అభయము శ్రీ సాయి భక్తులందరికీ అనుభవమగుచునే యుండును.

1973 సం॥ము నవంబరు నెలలో నేను పరమ పూజ్యులగు, దత్తాత్రేయో పాసకులగు నా గురుదేవులవారగు శ్రీ బాలభక్తమౌనీశ్వరస్వామివారి దగ్గరవుండగా నన్ను వెంటనే రమ్మని ఆఫీసునుండి నా మిత్రులు వుత్తరం వ్రాశారు. వెళ్ళడానికి అనుమతి నడుగగా మా గురువుగారు రెండురోజులాగి వెళ్ళమన్నారు. అలాగే వారి ఆజ్ఞను శిరసావహించి మూడవరోజు ఆఫీసుకు వెళ్ళగా ఆశ్చర్యకరమగు సంఘటన ఎదురైనది. మా గురువుగారిని వెళ్ళడానికి నేననుమతికోరిన రోజుననే మా ఆఫీసులో అగ్నిప్రమాదము జరగడమూ నా సీటుకు సంబంధించిన రికార్డులు తప్ప మిగిలిన వన్నీ కాలిపోవడమూ, ఆ మరురోజే పోలీసు ఎంక్వయిరీ జరగడం జరిగిపోయాయి. నేను Head quarters లో లేనందున పోలీసు ఎంక్వయిరీలో నన్నెవరూ ఏమీ అడగలేదు. నేను దప్ప మిగిలిన వారంతా Head quarters లోనే వుండినా, నావి దప్ప మిగిలినవారందరి రికార్డులు కాలిపోవడం కేవలం శ్రీ సాయి పరాత్పరుని కరుణయేయని నా విశ్వాసము.

1978 సం॥లో వైకుంఠ ఏకాదశినాడు శ్రీమత్సుందరాకాండ పారాయణము జేయుచూ శ్రీ ఆంజనేయస్వామికొరకై నొక ఆసనము నేర్పరచి యుండి, పారాయ ణము ప్రారంభించిన కొంతసేపటికే ఒక భక్తుడు శ్రీ సాయీశుని విగ్రహమును తీసుకునివచ్చి "శ్రీ సాయి దయవలన నాకు మంచి వుద్యోగము లభించినది. బజా

రులో వెళ్ళుచుండగా శ్రీ సాయీశుని విగ్రహము కనుపించినది. దానిని జూడగా మీరు గుర్తుకొచ్చి, దానిని మీకివ్వాలని తీసుకొచ్చా"నని అందించాడు. శ్రీ మారుతీ సాయి ఆ విధముగా మమ్ము కరుణించినాడని భావించి, ఆ తండ్రి ప్రేమవాత్సల్యము లకు మనస్సు కృతజ్ఞతాభావముతో పులకించగా, ఆంజనేయస్వామి కొరకేర్పాటుచేసిన ఆసనమునందు ఆ స్వామిని ఆసీనునొనరించితిని. పారాయణము కూడా నిర్విఘ్న ముగా సాగినది.

శ్రీ మారుతి అవతారముగా కీర్తింపబడిన శ్రీ సమర్థ రామదాసస్వామి సంప్రదాయములో ప్రస్తుతము గురువుగారుగానున్న శ్రీ సమర్థనారాయణ మహరాజ్ గారు 1944 లో పూజ్యులగు మా తండ్రిగారికి మంత్రోపదేశము చేశారట. 1978లో ఒకరోజు తమంతట తామే మాయింటికొచ్చి మమ్ముల ననుగ్రహించి వెళ్ళారు. ఆ తర్వాత కొలదిరోజులకే శ్రీ బాపట్ల వేంకట పార్థసారథిగారు "మీకు లేఖ వ్రాయు చుండగా, శ్రీరామచంద్రుని చిత్రమును మీకు బంపించమని ఆజ్ఞ నొసగినారని" ఉత్తరం వ్రాస్తూ ఆ చిత్రమును కూడా పంపించినారు. శ్రీ సాయి తానే మారుతిననీ, శ్రీరాముడననీ నిరూపించి తనయందు మాకు గల విశ్వాసమును పటిష్టము జేయు చున్నారు.

తాను సంకల్పించినదానిని బహుచిత్రముగా శ్రీసాయి నెరవేర్చుచుండును.

1979 జూలై నెలలో నాకు ఒంగోలునకు Transfer వచ్చింది. "మీరు నంద్యాలలో నుండగనే "శ్రీ సాయీ సుభాషితములు" ముద్రణ పూర్తి కావలయు నని "బాబా ఆజ్ఞ" యని పూజ్యశ్రీ పార్థసారథిగారు వ్రాసియుండుటవలన, మార్పు నాకెంతో బాధను కలిగించిది. శ్రీ సాయిని ప్రార్థించగా నంద్యాలలోనే వేరొక ఆఫీసునకు నన్ను మార్చినట్లుగా ముందుగా కలలో నా భార్యకు దెలిపి, ఆ తర్వాత వుత్తర్వులను బంపించిన శ్రీ సాయి దయవలననే 7_8_1979న మరల duty లో చేరగలిగితిని. శ్రీ సాయీశుని ఆజ్ఞ అనుల్లంఘనీయమే కదా!

శ్రీ సాయి నామస్మరణ, మనన, ధ్యానముల వలన భక్తులందరూ తప్పక సత్ఫలితములు పొందగలరనుట కెన్నియో అనుభవములు దోహదమొనరించుచున్నవి శ్రీ సాయీశుని అర్చించిన కుంకుమ, విభూతులతో అనేక శారీరక_ మానసిక రుగ్మ తలు, గ్రహబాధలు తొలగడం, ధైర్యోత్సాహములు కలగడం, అభీష్టసిద్ధి కలగడం యిక్కడనున్న భక్తులందరికీ ప్రతిదినమూ అనుభవమగుచున్నది.

ఇలా ఎన్నెన్నో చిత్రవిచిత్రమగు అనుభవములు కలుగుచునే యున్నవి. శ్రీ సాయి కరుణవలన నాస్తికులు భక్తులగుచున్నారు. ఎటువంటి సమస్యలు కలిగినా దిగులుజెందక శ్రీ సాయీ నామ స్మరణచేతనే పరిష్కరింపబడుచూ, యున్నవనే విశ్వాసముతో నిశ్చింతగా జీవించుచున్న భక్తులెందరో గలరు.

పరిపూర్ణమగు నిశ్చల నిష్కల్మష నిస్వార్థపూరితమగు భక్తి, ఆ సచ్చిదానంద స్వరూపునియందు కలిగినప్పుడే ఆ తండ్రికి సేవచేయాలనీ, ఆ తండ్రికరుణను అందరూ అందుకోవాలనీ, సోదర భక్తబృందమునకు వుత్సాహం కలిగించాలనీ, హృదయములో కలిగే తపన అంతులేనంత శాంతి సుఖానుభూతులను మనస్సుకు అందించి, ముంచి ఓలలాడించును. కర్త, కర్మ, క్రియలు తానే అయిన సాయీ పరమాత్మ అవాఙ్మానస గోచరుడుకదా! యే భావములేకుండా, ప్రతిఫల మాశించకుండా, పరమశక్తి వంతమగు ఆ తండ్రినామము నుచ్చరించుచూ, స్మరించుచూ ఆ తండ్రి నడపించు నటుల నడచుటయే మానవ కర్తవ్యము.

శ్రీ సాయీ భక్తులము అని చెప్పుకునే మనము ప్రత్యక్షముగగాని, పరోక్షముగ గాని, సర్వకాల సర్వావస్థలయందు ప్రతిప్రాణికీ యేదోరీతిగ వుపయోగపడి, ఆ పరమాత్మను చేరుట కనువగు సేవలు చేయాలి. అట్టి నిస్వార్థ సేవలను పవిత్ర హృదయము, ప్రేమతోచేసి ధన్యులగుటయేకాక వారి శక్తి మహత్తులను, సాహిత్యపు టౌన్నత్యములను మనకందరకు అందించిన మహాపుణ్యపురుషులు యీ గ్రంధ రచయిత కీ. శే. శ్రీ బాపట్ల హనుమంతరావు పంతులు గారు వీరి రచనలనుగురించి వర్ణించుటకుగాని, అభిప్రాయములు వ్రాయుటకుగాని శక్తి యెవ్వరికినీ చాలదు. ఒక్కమాటలో చెప్పాలంటే శ్రీ సాయీశుని గురించి యేమియు ఎరుగని వారు ఒకే ఒక్కసారి నిశ్చలమనస్కులై వీరి కృతులను పఠించిరేని తమ జీవితములో చేసిన, చేయుచున్న పొరపాట్లను చక్కదిద్దుకొని, సన్మార్గులై, ఆ తండ్రికి భక్తులై, శ్రీసాయీ స్మరణలోనే ఆనందమును పొందుచుందురనుట అతిశయోక్తి కాదు. వీరి రచనలలోని "శ్రీ సాయీ అనుసరణము" మహాశక్తివంతము మరియు మహత్తరమునై మహదానందకరమై ప్రతి భక్తునికి నిత్యపారాయణ కుపయుక్తమై యున్నది.

శ్రీ సాయీశునితో భక్తులకు గల అనుభవములను వ్రాయబూనడం మానవుల కసాధ్యము.

పరమ పూజ్యులు, శ్రీ శిరిడీ సంస్థాన ఆస్థానకవులు, శ్రీ సాయి అంకిత సంతతిలోని వారగు కీ. శే. బాపట్ల హనుమంతరావు పంతులుగారి కుమారులునూ, నిస్వార్థ శ్రీ సాయీ సేవాతత్పరులునూ, శ్రీ సాయి కత్యంత ప్రియములగు నిష్ఠ, సబూరిలను ఆచరణలోనికి దెచ్చుకోగలిగిన పూజ్యులు శ్రీ వేంకట పార్థసారథిగారు. ప్రేమాభిమాన వాత్సల్యములతో "శ్రీ సాయీనాథునితో గల అనుబంధము; అనుభవ పూర్వక వాక్యములను, శ్రీ బాబా పలికించినరీతిగా వ్రాయమనియూ, తొలిపలుకుల వ్రాసెడి మహద్భాగ్యమును శ్రీ ప్రభువు నా కొసంగ అజ్ఞ నొసంగెననియూ" ఆదేశించిరి.

సాహిత్య పరిచయములేక, అనుభవమూలేక, జ్ఞానము లేనట్టి నేను ఈ పవిత్ర గ్రంథమునకు తొలిపలుకుల వ్రాయబూనడం సాహసమే అవుతుంది. శ్రీ సాయి ఈ అనామకునిపై యింతటిభారము నేలమోపెనో ! కానీ సర్వమూ శ్రీ సాయిమయముగా భావించుచున్న స్థితిలో ఈ తొలిపలుకులను ఆ ప్రభువే వ్రాయించుకున్నాడవి దలంచుచుంటిని. శ్రీ సాయీశుడు దేనినెందుకెలా జేయునో అది ఆ తండ్రికే దెలియును.

**శ్రీ సాయిని నమ్మినవారికి సంతాపము లేదు.**

**బాబాను నమ్మినవారికి భయము లేదు.**

అందరినీ తన కరుణాకటాక్షవీక్షణములతో పరిరక్షించమని ప్రార్థించుచూ ఈమహద్భాగ్యమును కలిగించిన సాయిరూపమునకు జయము జయమని బలుకుతూ యున్నాను.

ఓం సాయి.

8/60, మాల్దారుపేట,
నంద్యాల - 518 501.

శ్యామచరణుడు
నంద్యాల,
8-10-1979.

# —: పోషకులు :—

| | |
|---|---|
| Mrs Sarojini Devarajulu Naidu, Calcutta | Rs. 200-00 |
| Sri C. Simhachalam, A. E, Anantapur | 200-00 |
| శ్రీమతి మాకం కృష్ణవేణమ్మ, తాడిపత్రి | 110-00 |
| స్వర్గీయ శ్రీమతి పిల్లలమర్రి నాగలక్ష్మమ్మగారి జ్ఞాపకార్థముగ వారిభర్త పూజ్యశ్రీ పిల్లలమర్రి విశ్వనాథంగారు, సికిందరాబాదు | 100-00 |
| కుమారి బచ్చు కళావతి, నంద్యాల | 74-00 |
| శ్రీమతి & శ్రీ డి. గోపాలరెడ్డి, అనంతపురం | 70-00 |
| శ్రీ M. శివశాస్త్రి, L. C. E. సూపర్వైజరు (I. & P. D.), నంద్యాల | 68-00 |
| శ్రీ కసిరెడ్డి, ఓబులరెడ్డి Land Lord, కొత్తపల్లె | 60-00 |
| శ్రీమతి జి. జయలక్ష్మి, అనంతపురం | 60-00 |
| కీ. శే. పెద్దల జ్ఞాపకార్థం శ్రీ M. వెంకట సుబ్బయ్య, నంద్యాల | 55-00 |
| Sri Maganti Lakshmana Rao, B. A.. B. L.,, Machilipatnam | 50-00 |
| శ్రీ కె. బలరామయ్య, చల్లపల్లి | 50-00 |
| శ్రీ నార్పల మృత్యుంజయరావు, Land Lord, నార్పల | 45-00 |
| శ్రీ G. రోశయ్య, L. C. E., సూపర్వైజరు, కోయిలకుంట్ల | 45-00 |
| శ్రీ V. V. మనోహర్, L. C. E., సూపర్వైజరు, నంద్యాల | 40-00 |
| శ్రీ T. వెంకట శివయ్య, L. C. E., సూపర్వైజరు, నంద్యాల | 40-00 |
| శ్రీ నల్లగట్ల లక్ష్మినరసింహయ్య, నంద్యాల | 40-00 |
| శ్రీ మురారి పుల్లయ్య, Tracer, (I. &. P. D.), నంద్యాల | 35-00 |
| శ్రీ G. సదాశివయ్య, B. A., Teacher, నారాయణపురం | 35-00 |
| శ్రీ K. సుబ్రమణ్యం నాయుడు, B. E.. J. E., నంద్యాల | 35-00 |
| శ్రీ K. రోశప్ప, U. D. C. (Elecl. Dept.), ఆదోని | 30-00 |
| శ్రీ నారప్ప, Accountant, సిండికేటు బ్యాంక్, నంద్యాల | 30-00 |
| శ్రీ కంది బాలకిష్టయ్య గారి నారాయణ & సన్సు, సికింద్రాబాద్ | 30-00 |
| శ్రీ L. S. N. శర్మ, విజయవాడ | 30-00 |
| శ్రీ అంబటి రామేశ్వరం రెడ్డి, భీమవరంగ్రామం | 23-00 |
| శ్రీ A. V. S. R. జోశ్యులు, గుంటూరు | 22-00 |
| శ్రీ B. L. నరసింహమూర్తి, B. E., J. E., అనంతపురం | 20-00 |

| | |
|---|---|
| శ్రీ N. వేణుగోపాల్, హైదరాబాదు | 20-00 |
| శ్రీ K. B. వెంకటప్పయ్య, L. C. E., సూపర్వైజరు, నంద్యాల | 20-00 |
| శ్రీ R. V. నరసింహులు, L. D. C., (I. & P. D.), నంద్యాల | 20-00 |
| శ్రీ CH. విస్సావధానులు. A. S. M., అనపర్తి | 20-00 |
| శ్రీ K. వెంకటస్వామి, L. D. C., (I. & P. D.) నంద్యాల | 20-00 |
| శ్రీ G. తిమ్మారెడ్డి, L. C. E., సూపర్వైజరు, నంద్యాల | 20-00 |
| శ్రీ శ్యామచరణ్, నంద్యాల | 20-00 |
| శ్రీ M. నరసింహమూర్తి, Attendant (I. & P. D.), నంద్యాల | 15-00 |
| శ్రీ P. K. బసప్పర్, Manager, ,, ,, | 15-00 |
| శ్రీమతి O. మీనాక్షమ్మ, అనంతపూరు | 15-00 |
| శ్రీ K. మాణిక్యము గుప్తా, సికిందరాబాదు | 12-00 |
| శ్రీ నార వీరేశము, పార్శిగుట్ట-సికిందరాబాదు | 12-00 |
| శ్రీ వి. రాంచంద్రారెడ్డి, గోపారము | 12-00 |
| శ్రీ దొంతిరెడ్డిగారి సీతారాం రెడ్డి, గోమారము | 12-00 |
| శ్రీ S. L, స్వామి, గోమారము | 12-00 |
| శ్రీ ఇప్పరాం రెడ్డి, కానుకుంట | 10-00 |
| శ్రీ చంద్రమౌళి వెంకట భావనారాయణ, బాపట్ల | 10-00 |
| శ్రీ వి. చలమయ్య, W. I., S. I., Sub.Du., నంద్యాల | 10-00 |
| శ్రీ పి. రామేశ్వరరెడ్డి, Land Lord, భీమవరం | 10-00 |
| శ్రీ పి. శ్రీరాములు, L. C. E. Supervisor, నందికొట్కూరు | 10-00 |
| శ్రీమతి శ్యామసుందరి, నంద్యాల | 10-00 |
| శ్రీ గుండాచార్లు, Typist (I. & P. D.) నంద్యాల | 10-00 |
| శ్రీ జి. వీరభద్రయ్య, Co-op. Dept., ఓర్వకల్లు | 10-00 |
| శ్రీమతి కె. అరుణాదేవి, నంద్యాల | 10-00 |
| కుమారి అన్నపూర్ణ, K. M. కొండూరు | 10-00 |
| శ్రీ యం. రామమోహనరావు, యల్లందు | 10-00 |
| శ్రీ ఆర్. రంగనాథన్, బి. ఏ., బి. యల్., కడప | 10-00 |
| శ్రీ K. C. రామసుబ్బారెడ్డి, Junior Engineer, నంద్యాల | 10-00 |
| శ్రీ బి. సుబ్బారెడ్డి, Asst. Engineer (I. & P. D.) నంద్యాల | 10-00 |

| | |
|---|---|
| కుమారి టి. చెంచులక్ష్మి, పుత్తూరు | 10-00 |
| శ్రీ వి. శివరామరంగయ్య, B. E., A. E., (I, & P. D.), నందికొట్కూరు | 10-00 |
| శ్రీ కె. వీరరాఘవ పిల్లరి, Supervisor (I. & P. D.), అనంతపురం | 10-00 |
| శ్రీ జాస్తి సూర్యనారాయణ, జాలిపూడి | 10-00 |
| శ్రీ C. S. రావు, మద్రాసు-90 | 10-00 |
| శ్రీ యం. రంగయ్య, Land-Lord, చిన్నదేవలపురం | 10-00 |
| కుమారి టి. నాగమణి, పుత్తూరు | 9-00 |
| శ్రీ జి. రామకృష్ణ, కొవ్వలి | 9-00 |
| శ్రీమతి యల్. లక్ష్మీదేవమ్మ, నంద్యాల | 7-00 |
| శ్రీ జి. వెంకటరెడ్డి, Supervisor (I. & P. D.), నంద్యాల | 5-00 |
| శ్రీ డి. సత్యనారాయణ, Lascar (I. & P. D.) నంద్యాల | 5-00 |
| శ్రీ పి. నారాయణ, ,, ,, | 5-00 |
| శ్రీ జి. యేశయ్య, ,, ,, | 5-00 |
| శ్రీ బి. లక్ష్మయ్య, Attender ,, ,, | 5-00 |
| శ్రీ R. అనంతరామయ్య, Attendant ,, ,, | 5-00 |
| శ్రీ నాయక్ పకీర్ నాయక్, Land Lord, నంద్యాల | 5-00 |
| శ్రీ శిల్పి పెద్ద నారాయణ, నంద్యాల | 5-00 |
| శ్రీ కె. నరశింహులు, Branch Library, పుత్తూరు | 5-00 |
| శ్రీ. Dr. A M. మునిరత్నం, పుత్తూరు | 5-00 |
| కుమారి టి. శివకామాక్షి, పుత్తూరు | 5-00 |
| Dr. R. వాసుదేవరావు, ముక్కామల | 5-00 |
| శ్రీ N. C. మీరయ్య, H. C. (K. C. C. Dn.), నంద్యాల | 5-00 |
| శ్రీ వెంకట సుబ్బయ్య, S. R. C. I. Sub. Dn., నంద్యాల | 5-00 |
| శ్రీ జి. జ్వాలాపతి, నారాయణపురం | 5-00 |
| శ్రీ యస్. వెంకటస్వామి, కమలాపురం | 5-00 |
| శ్రీ పత్రి పాండురంగ విఠల్‌రావు, కురబలకోట | 5-00 |
| శ్రీ V. M. జక్కయ్య | 1-00 |
| శ్రీమతి జి. కృష్ణవేణమ్మ, నంద్యాల | 1-00 |
| శ్రీ జి. ప్రతాప్, నూనెపల్లి | 1-00 |

—o—

శ్రీ సాయీనాథాయ నమః

# వి జ్ఞ ప్తి

సోదరీ సోదర సాయీ భక్తులారా !

శ్రీ సమర్థ సచ్చిదానంద సద్గురుదేవుడగు శ్రీ సాయీ ప్రభువు కరుణ వలన మీ అందరి సహాయ సంపత్తితో శ్రీ సాయీ సంస్థాన కవీంద్రాది బిరుదాంకితులైన మా తండ్రి కీ. శే. పూజ్యశ్రీ బాపట్ల హనుమంతరావు పంతులు గారు రచించిన గ్రంధములందలి నాల్గు అంశముల నిందు పొందుపరచి "శ్రీ సాయీ సుభాషితములు" అను యీ కృతిని మీ కందించు భాగ్యము నాకు కలిగినది.

**శ్రీ సాయీ సుభాషితములు :-** మా తండ్రి 1973 లో యీ పేరున కావ్యము వ్రాయదలంచి యాభై రెండు పద్యములు మాత్రమే వ్రాసి అనారోగ్య కారణమున ముగించలేకపోయిరి. ఈ భాగమునకిది ప్రథమ ముద్రణ మగుటచే నీ కృతికి "శ్రీసాయీ సుభాషితములు" అను పేరున ముద్రించుట భావ్యమని తలంచితిని.

**శ్రీసాయీ కబీరు సూక్తులు :-** 1965 లో శ్రీసాయీభక్తాగ్రగణ్యులు Retired Asst. Postmaster, ప్రస్తుతం నెల్లూరు శ్రీ సాయీబాబా మందిరమున కార్యదర్శిగ పనిచేయుచున్న శ్రీ పి. మాలె కొండయ్య గారి ద్రవ్య సహాయమున ప్రధమ ముద్రణ జరిగినది. మహారాష్ట్ర భాషలో కబీరు రచించిన సాఖీలు రెండు వేలకుపైగా కలవందురు. వానిలోని నూటయిరవై రత్నములను గ్రహించి తెనుగు ద్విపదలలోనికి అనువదించి తండ్రిగారు ప్రచురించిరి. కబీరు శ్రీసాయీ నాధుడుగ, కబీరు గురువు రామానందుడు, శేలునందు గోపాలరావు దేశ్‌ముఖ్‌గ (వేంకుశుడు) నవతరించినట్లు దాసగాణూ మహరాజ్ మొదలగు మహాభక్త కవుల రచనలవలన విస్పష్ట మగుటచే నీ కృతికి "శ్రీసాయీ కబీరు సూక్తులు" అని మా తండ్రి పేరిడిరి.

**శ్రీసాయీ స్మరణ :-** ప్రథమ ముద్రణ 1957 లోను; ద్వితీయ ముద్రణ 1962 లోను "శ్రీసాయీ పూజా స్తవము" లో ఒక భాగముగా మా తండ్రి ప్రచురించిరి. బాబా ఆశ్రయము లభించిన పిదప అపారమగు భక్త్యావేశమున నోటి

నుండి వెలువడిన భావములు, బాబా యందుగల నమ్మకము, చనువు, వారి అనుభవములు యీ పద్యరూపము ధరించి, యెల్లరకు పఠింప యుపయుక్తములై యున్నవి.

**శ్రీసాయీబాబా పూజావిధానము :** శ్రీసాయీ పూజా స్తవములో యిదియు నొక భాగముగ యిదివరకే మూడు ముద్రణలు జరిగినవి. సోదర భక్తుల కందుబాటులో వుండి నిత్యపూజకుపయుక్తముగ సంక్షిప్తపరచి, యిందు చేర్చితిని.

**కృతజ్ఞతలు** :- శ్రీసాయీ భక్తాగ్రగణ్యులు, నా శ్రేయోభిలాషులు నగు పూజ్యశ్రీ పిల్లలమర్రి విశ్వనాథంగారు మా తండ్రిగారి రచనల నమితాసక్తి పఠించి, అనుసరించి, ఆనందించి, ప్రధాన పోషకులుగ వారి సతీమణి, పుణ్యవతి, స్వర్గశ్రీ నాగలక్ష్మమ్మగారి జ్ఞాపకార్థముగ విరాళములు తరచుగ పంపుచూ వారి అమూల్యాభిప్రాయములు వుత్తరముల ద్వారా తెలుపుచుండిరి. అందలి ముఖ్యాంశముల నేరి "ఆశీస్సు" ను ముద్రణ కనుమతించిరి. శ్రీ సాయీప్రభువు పలికించిన రీతి నా కృతజ్ఞతను ప్రకటించుకొనుచున్నాను.

ఎల్లరుమెచ్చ తండ్రి రచియించిన సంత్కృతులందు సారమున్
చల్లని ద్రాక్షపానకము చాడ్పున ద్రావి ప్రశాంతినొంది, నా
యుల్లము రంజిలన్ తెలిపె, యున్న యథార్థము పుణ్యమూర్తి; యీ
'పిల్లలమర్రి' వంశఖనిఁ బ్రీతినుతింతును **విశ్వనాథునిన్.**

శ్రీ సాయీ ప్రభుని లీలలపారములు - అనూహ్యములు, ఆనందమయములు. ఎప్పుడెవరివలన ఏ పని చేయించుకొనునో ఆ స్వామికే యెఱుక. సాయీ భక్తుల ప్రోత్సాహమున యిప్పటికి శ్రీసాయీ నిలయప్రచురణములు పది వెలువడినవి. ప్రతి ప్రచురణ విషయము సందియమే ; ప్రతి అడుగు సంశయాస్పదముగనే తోచును. ప్రతిక్షణము ఆ సాయీప్రభుని కటాక్షము ప్రసారమగుచునే యున్నది. ఇది గుర్తించలేకపోవుటయే దైవ మాయ.

ప్రతి ప్రచురణకు శ్రీ సాయీ ప్రభువు ముందే ఒక మూలపురుషుని నియమించుకొని తనకార్యము చక్కబరచుకొనుచుండును. ఆ సమయమాసన్నమైననే గాని ఆ భక్తుని ముందునకు రానీయడు.

శ్రీ సాయీ సుభాషితములు ముద్రణకు మూలపురుషునిగ సోదరభక్తుడగు చిరంజీవి శ్రీ తుర్లపాటి బాలగురునాథ్ (శ్యామచరణుడు) ను శ్రీ సాయీ ప్రభువు నాకు పరిచయము కలిగించెను. ఈ కృతి నీతని యాధారమున ముద్రణ జరుగ నాదేశించెను. ఈ బాలభక్తుడు నంద్యాలలో, పి. డబ్లు. డి. (బి) శాఖలో సెక్షన్ ఆఫీసరుగా పదవి బాధ్యతలను కడు నైపుణ్యముగ నెరవేర్చుకొనుచూ, అవకాశము దొరికిన కాలము సద్వినియోగపరచుటకు శ్రీ సాయీ ప్రభువు యీతని నాశీర్వదించెను. శ్రీసాయీప్రభుని యాదేశ మీతనికి దెలిపితిని. "ఈ కార్యభారమునంతయు మీరే వహించి, యీ పుస్తకమును నంద్యాలలోగాని మరొక అనుకూల ప్రదేశమునగాని మీ ఆధిపత్యమున ముద్రింపుడని" వ్రాసి యీ భారమునుండి తప్పించుకొన ప్రయత్నించితిని. సాయందవ్యాజానురాగముఁగలవాడగుట నా కోరిక నీతడామోదించి ముద్రణ ప్రయత్నము చేసెను. ఉభయులము విఫలమనోరథుల మైతిమి. శ్రీసాయీశుని ఆజ్ఞ మరొకరీతిగనుండ దానిని పరివర్తనచేసి యుల్లంఘించబూనుట బాబా కామోదమెట్లగును? ఇది క్షమించరాని నేరమని ఆ స్వామి నాకు బోధించెను. సాయీనాథుని ఆదేశమునకు బద్ధుడనై స్వామి పాదములపై బడి, క్షమాభిక్ష వేడుకొని, యీ గ్రంథ ముద్రణ కార్యము నేనే యొనర్తునని ప్రార్థేయపడి కార్యోన్ముఖుఁడనైతిని.

ఈ గ్రంథముద్రణకు వలయు ద్రవ్యమునందధికభాగ మీ సోదరుడు బాలగురునాథ్ సోదరభక్తుల నెందరినో ప్రోత్సహించి, సేకరించి, నాకు పంపుటయే కాక, పూజ్యులు మా తండ్రిగారి షష్ఠమ వర్ధంతి (1-11-79) సమీపించుచున్నదని తరచు హెచ్చరించుచునే యుండిరి. ఇది ఆ సాయీశుని ప్రేరణగ నా మనస్సున కాతురత కలిగించి కార్యోన్ముఖునిఁగఁజేసెను.

ఈ గ్రంథమునకు 'తొలిపలుకు'ఁగూర్చు భాగ్యమును యీ చిరంజీవికే శ్రీ సాయీప్రభువొసంగుటయు నీతని పుణ్యవిశేషమే యగును. ఈరీతి శ్రీ సాయి ముద్రణకు పాత్రుడైన ఈ చిన్నసోదరుని గురించి, ముఖపరిచయము లేకపోయినను, పొగడికలు కూడదని యెఱింగియు నా మనమున బాబా కలిగించిన భావములు తెలుపుట యుక్తమేయగునని నా తలంపు.

పదవి బాధ్యతలను చక్కఁబఱుపుకొనుచును,
పడును వేఱొక ప్రక్క, సాపాటు పాట్లు

అందుపాటు కాలము వృథావ్యయముఁగాక
తోడి వారి భక్తులఁజేయ తుర్లపాటి
బాల గురునాథునకు పరిపాటి కాదె !

శ్రీ సాయీశ్వరు డీతనివలన యిట్టి మహత్కార్యము లెన్నియో చేయింప తలపెట్టి సుమారు 35 యేండ్ల ప్రాయముగల యీతనిని చాలకాలము క్రితము తన భక్తునిగ స్వీకరించుట ముఖ్యవిశేషము. ఈతడేకార్యమేనియు త్రికరణ శుద్ధిగ జేయునని యీతడు తొలిపలుకులే తెలుపుచున్నవి.

భావము, వాక్కు, క్రియయు, స్వా
భావికముగ నొక్కటగుచు ప్రాపించె, చిరం
జీవికి, యనుఁగు సహోదరు
జీవితమున్ మధుర తరముఁ జేయవె సాయీ !

ఈతడు భక్తుడగుటయే కాక మంచి వక్త, వాక్కు, రూపములవలె యీతని వ్రాతయు మనోహరముగ నుండును. ఈతఁడే ప్రాంతము నందున్నను, మనస్సు నన్యమార్గమున పయనింపనీయక, అవకాశము దొరికినపుడు ఆయా ప్రాంతముల నాబాల గోపాలమును జేర్చి సత్ గురుదేవుడగు శ్రీసాయీ నాథు మహత్మ్యముల బోధించి, వారినెల్ల భక్తులనుజేసి, భజన, మనన, సంకీర్తన, పూజాదులాచరించుచు, శ్రీసాయీ సత్కథాకాలక్షేపమొనరించి, ఆనందాబ్ధిమునిగి, తన్మయతజెంది, ఆయానందానుభూతి నెల్లరకు అందించుచుండుటచే ఈతడు సార్థక నామధేయుడే యగును. కాని యీతడీపేరున పిలువబడుట కతిశయోక్తిగఁ దోచి కాబోలు శ్రీసాయి చరణాంకితుడుగ పిలువబడఁ బ్రీతిఁబడి "శ్యామచరణుడు" అను బిరుదును ప్రభుని యనుమతితో నీతడు స్వీకరించి యుండును. ఈతనికి అంగీకారము కాకున్నను, నామాటఁ దాటనేరని వాడగుటంజేసి తన చిత్తరువును బంపి ప్రకటించుట కవకాశము కలిగించినందు కితని నభినందించుచున్నాను.

ఈ ప్రాయము నందిన్ని ప్రశంసల నందుకొన్న యీ బాలగురునాథు శ్రీ సాయీ పదసేవా దురంధరుడుగ, పుస్తక రచయితగ, గ్రంథ పోషకుడుగ, కార్యకర్తగ, ఉన్నతోద్యోగిగ, రాణించునటుల శ్రీ సాయీ ప్రభువీతనిపై కృపజూపి, నీతనికి, యీతని పుణ్యసతి అ॥ సౌ॥ శారదను, వీరి చిరంజీవి దత్తగురు సాయి

రాముని ఆయురారోగ్య ఐశ్వర్య వంశాభివృద్ధిగూర్చి సర్వదా సర్వథా కాపా
వేసుకొను చున్నాను.

శ్రేయముఁగోరి భక్తులను జేరి విరాళము సేకరించి శ్రీ
సాయి సుభాషితములకు సాయమొనర్చిను యచ్చుఁగూర్పగా,
నాయనుజుండు బాలగురునాథు చిరాయువు, వంశవృద్ధియున్
శ్రీయును, భోగభాగ్యములుఁ జేకురఁ జేయవె సాయిసత్ప్రభూ!

## 1980 ముద్రణవిషయము

ప్రపంచమున యీ సంసారబంధములఁ జిక్కువడి సంకటములు పొందుట భగవద్భక్తి లేని కారణముననే కాని జ్ఞానము లేకపోవుట చేతఁగాదు. ఈ జ్ఞానము అహంకార మమకారముల (నేను – నాది) చే కప్పబడుటచేత మానవుడు భగవంతునికి దూరమగుచున్నాడు. ఈ భగవద్భక్తి సాధు సత్పురుషుల సాంగత్యము చేతనే సాధ్యమగును. భగవదనుగ్రహముననే సాధు సాంగత్యమును లభ్యమగుచున్నది. ఈ 'భక్తి' ప్రేమరూపము, అమృతరూపమునై యున్నది. దైవమునందు ప్రేమయే 'భక్తి' యని చెప్పబడును.

కాంతా కాంచనములందెట్టి కాంక్షతో దివారాత్రములు యెన్నెన్ని పాట్లు పడుదురో అటులనే భగవానుని యందు కళ్యాణ గుణాదుల దలంచుచు కీర్తించుచు, వినుచూ, పలుకుచూ, వివిధసాధనోపాయములచే దైవమును దర్శించి భగవానుని యందు లీనమై భగవద్విరహమునకు పరమ వ్యాకులత నొందుటయే 'ప్రేమ' అని తలంచనగును.

హృదయమను ప్రమిదయందు ప్రేమ యను చమురుపోసి, కామక్రోధములు, అహంకార మమకారములను దారములను పేని వత్తిచేసి, చమురులో ముంచి, తండ్రి (గురువు) జ్ఞానజ్యోతిని వెలిగించి యుండిరి. ఈజ్యోతి దిన దిన ప్రవృద్ధమానమై అజ్ఞానాంధ కారమును పటాపంచలు చేసి దైవసాన్నిధ్యమును శుభ్రమార్గమున నడిపించుటకు "శ్రీసాయీ లీలాప్రచురణములు" అనునొక కార్యక్రమమున నన్ను, నియమించి ప్రమిదలందు ప్రేమామృతము కొరత పడకుండ నింప శ్రీసాయీప్రభువు పోషకుల (భగవదనుగ్రహ సాధనలు) నేరికోరి యాజ్ఞాపించుచున్నారు.

స్వామి యీ విధముగ ఆరు సంవత్సరములనుండి నిర్ణయ రీతిని కార్యములు జయప్రద మొనరించుకొనుచునే యుండెను. ఈ యదార్థమును గ్రహింపలేక మానవతఁ దొలగిన మాయఁబడి, ముందు కార్యక్రమ మెట్లోయని కలతఁజెందు నా మానసమున సాయీప్రభువు పొడమి చులుకుగలుగ.

"ఆరు వత్సరముల నుండి ఆదుకొననె ?
నాకు వలయు రీతిని నిన్ను నడుపు కొందు,
ముందు ముద్రణకై నీవు కుందనేల?
సాగిపొమ్ము నాయందు విశ్వాసముంచి!"

అని వీపుపై చఱచినాడు.

శ్రీ సాయీప్రభువు 1980 సంవత్సరములో "శ్రీసాయినాథ బోధామృతము" అను పవిత్ర గ్రంథరాజమును ప్రచురించి, సోదర భక్తుల కందించ నాజ్ఞనొసంగెనని తెలుపుట కుత్సాహపడుచుంటిని. ఈ గ్రంథమును అఖిలభారత సాయీ సమాజ సంస్థాపకులు 'శ్రీ సాయీ వ్యాసుడు' అను బిరుదు గడించిన పూజ్యశ్రీ బి. వి. నరసింహస్వామిగారు (H. H. Sri B. V. Narasimhaswami) ఆంగ్లమున రచించిన Gospel of Sai Baba (Sri Sai Baba's charters and Sayings) అను కృతిని నాతండ్రిగారు పూజ్యశ్రీ బాపట్ల హనుమంతరావు పంతులుగారు వచనమున అంధ్రీకరించిరి. దీనిని శ్రీ సాయీబాబా 50 వ మహాసమాధి స్వర్ణోత్సవ స్మృతి చిహ్నముగ 1968 లో అఖిల భారత సాయీ సమాజము మద్రాసు వారు ముద్రించిరి. కాని, యీ గ్రంథములు లభ్యము కానందున సోదరభక్తులందరు శ్రీసాయీప్రభుని అభయప్రదానములు – సూక్తులు 643 గల వచనగ్రంథమును ముద్రణగావించుట, నిత్య పారాయణ కత్యవసరమని తరచు హెచ్చరించు చుండుట చేత యిది ప్రభుని యాజ్ఞగ శిరసావహించి 1980 లో దీనిని ముద్రింప సాహసించుట మీ యదంర అండదండలే ముఖ్య కారణము.

కాగితము ధరలధికముగ నున్నవి. ముద్రణ వ్యయమును పెరిగినది. ఈ స్థితిలో 500 పుటలు గల యీ గ్రంథ ముద్రణకు సుమారు రు. 8000/- లు అవసరమగునని అంచనా వేయబడినది. మీ యందరి సహాయ సంపత్తితో, నేను సఫలీకృత మనోరథుడను కాగలననీ, మీరు యిదివరలో ప్రకటించుచున్న ప్రేమౌదార్యములను ద్విగుణీకృతము చేసి, సోదరీ, సోదర భక్తులను, పరిచితుల నుచితరీతిని

ప్రోత్సాహపరిచి, పోషకులుగా చేర్చి యీ కార్యభారము మీ యదిగా ప్రతిఒక్కరు భావించి, యీకృతిని వెలువడజేయు భాగ్యము నాకు కలిగించి, శ్రీసాయీకృపకు పాత్రుడు కాగలరని, శ్రీసాయీప్రభువు మీ కట్టి అవకాశము, ఆవేశము, ఆలోచన, అనుగ్రహము కలిగించగలడని నాదృఢ విశ్వాసము. ప్రతినూతన పోషకునికి నావద్ద లభ్యమగు శ్రీసాయీ నిలయ ప్రచురణములమచితముగ పంపగలనని మనవి చేయుచున్నాను. ప్రచురణములన్నియు శ్రీసాయీప్రభుని సొత్తు, ఈప్రచురణములను సద్వినియోగపరచి, ముందు ప్రచురణలకు తోడ్పడుటయే నేనుకోరునది. ఇది యెల్లరు గమనించ ప్రార్థన. ఇదివరలో మీకు విన్నవించిన రీతిగ తపాలాఖర్చులు తప్ప పోషకులు పంపు ప్రతిపైసయు గ్రంథ ముద్రణకే వినియోగపర్చబడును గాని అన్య విధముగ నుపయోగ పర్చుటకు శ్రీసాయీనాధుడంగీకరింపడు.

ఈ గ్రంథ ముద్రణకు తోడ్పడిన పెద్దలందరకు నా హృదయపూర్వక నమస్కృతుల నర్పించుకొనుచున్నాను. పిన్నలందరకు శ్రీసాయీప్రభువు చిరాయు రారోగ్య ఐశ్వర్యాభివృద్ధులు అభీష్టసిద్ధిని ప్రసాదించగలడని నా ప్రార్థన.

కలదో ! లేదో! యటుంగ; పోషకులు నాకార్యంబు చక్కంబడన్
పలుత్యాగంబులుఁజేసె, నీకరుణ సంపాదింపఁగాఁగోరి, నా
పిలుపాలించి విధేయులై యొసగరే ప్రీతిన్ విరాళంబు; వీ
రలకున్ యోగముక్షేమమున్ బఱపి సంరక్షించు! సాయీశ్వరా !

26-8-1979 న నేను హైదరాబాదునయుండి, యీ గ్రంథమునకు 'బాబా' చిత్తరు వెట్టిది ముద్రించిన యనువగునోయని ఆలోచించు సమయమున నాకడకు మా తండ్రిగారి చిరకాల పరిచితుడు, శిష్యుడు, సోదర సాంఘిక స్తుడునగు చి॥ శ్రీ కె. సుబ్బారావుగారు వచ్చి శ్రీసాయీప్రభుని Colour Photo లు 1000 గల పార్శిలు నాకందించిరి. ఇది శ్రీసాయీ ప్రభుని ఆజ్ఞగ దలచి ఆచిత్తరువునే యిందు చేర్చితిని. ఇట్టిఅమూల్యకానుకను శ్రీసాయీప్రభుని కర్పించిన చి॥ శ్రీ॥ సుబ్బారావునువీరి కుటుంబసభ్యులను శ్రీసాయీప్రభువు సకలైశ్వర్యములు ప్రసాదించి కాపాడగలడని నా ఆశ.

శ్రీసాయీ నిలయమ్
చెరువు
30-10-1979

ఇట్లువిన్నవించు
శ్రీసాయీ భక్త పాదరేణువు
బాపట్ల వేంకటపార్థసారథి.

ఓమ్ శ్రీ సాయీ నాథాయనమః

# శ్రీ సాయీ సుభాషితములు

గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాసశ్శరణం సుహృత్
సమర్థ సచ్చిదానంద భగవాన్ సాయిసద్గురుః

## మంగళాశాసనము

శ్రీ వేంకటేశ ప్రసిద్ధ స్వరూప గోపాల సద్గురు కృపావర్థితంబు,
క్షేత్ర తీర్థ విశిష్ట శిర్డీ పురస్థిత ద్వారకా మాయీ ప్రభాసితంబు,
చందోర్కరాది ప్రశస్తభక్తసమార్జితైహికాముష్మికాప్యాయనంబు,
ప్రాణి హితంకర పరమేశ దివ్యావతార రహస్య ప్రచారకంబు,

సగుణ నిర్గుణోపాసనాసక్త ఫలము,
వేద వేదాంత సిద్ధాంత విస్తృతంబు,
సర్వసౌలభ్య, మార్త రక్షణ సమర్థ
మగుచు 'శ్రీ సాయిలీల' యీ జగతి నలరు !
శ్రీ పరాత్పర ! సాయీ ! కృపాపయోధి !
నాపలుకు సాహసంబును సైపఁ గదవె !
స్వల్ప మతి యెఱుంగునె నీ యపార చరిత ?
నిన్ను - నీనామమును నమ్మి నెమ్మినుందు.
నరుని వలెఁ దోఁతువీవ, యీశ్వరుఁడ వీవ,
కర్తవీవ, క్రియయునీవ, కర్మవీవ,
పావనుఁడ వీవ, యుత్తమ వ్యక్తి వీవ,
సర్వజగముల ప్రభువీవ, సాయిదేవ !
జయము ! శిర్డి నివాస ! శ్రీసాయి ! నీకు,
జయము ! శ్రీ ద్వారకా మాయిసాయి ! నీకు,
జయము ! సర్వదేవాత్మక సాయి ! నీకు,
జయము ! భక్త హితప్రద ! సాయి ! నీకు ! !

శ్రీ సాయీ శరణ్ !

# శ్రీ సాయీబాబా ఏకాదశ సూక్తులు

— o —

1. శిరిడీ గ్రామము జేరినవారిని - జెనకవు వ్యసనములు
2. ద్వారకామాయిని వడుగిడు మాత్రన ప్రాపించును సిరులు
3 భౌతిక దేహము వదలితి ననియే - భయమును గననేల ?
ప్రాతిగనా వారికి జాగృతితో బ్రాపిడు దెవ్వేళ.
4. ఆసక్తి సమాశ్రయించు వారల - నన్ని వేళలందు
ఈ సమాధియందుండియె రక్షణ - మిచ్చెద నికముందు
5. మెలకువతో నీ సమాధినుండియె మిమ్మెల్లర గందు
6. మెలవ్వున నిందుండి మనుజభాషల - మీతో వాకొందు
7. శ్రితుడై శరణొందిన వానిని ర - క్షించుట నా వ్రతము.
8. వ్రతమతి నను జూచువాని యెడ నే - బఱపుదు కటాక్షము.
9. భక్తి పరుండై యెవండు నాపై భారంబుల నునుచు
సక్తిని నే నిర్వహింతు వానికి - సౌఖ్యంబుల నిడుచు
10. సాయం జేసియు బోధనేవి యే - జను డాసించినను
శ్రేయక వానికి హితగతి నే దో - డ్తో సమకూర్చుదును.
11. ఈ రహస్యమిక మీరలు నమ్ముడి ! యెందు మఱువరాదు
దారిద్ర్యము నా భక్తునింట నె - త్తటి నిల్వగబోదు.
తో॥ సాయీబాబా ముఖోద్గతము లీ - సత్యాభయ సూక్తులను
శ్రేయస్కాములు విశ్వసించి యార్జింపుడు సుఖశాంతులను.

— o —

# మేలుకొలుపు

"జాగృతినిఁ బొందు బిడ్డ!" శ్రీసాయి పలుకు
"అదియొకను దూరమందు మాయాపిశాచి,
పలుగు వాలుచు నినులోభ పఱచుచుండె
ఆశపడితివా? యగు సర్వనాశనంబు.

ద్వారకామాయి సౌధకవాటమెపుడు
దిక్కులేని వారల చేరఁ దెఱచియుండు
వస్తు సంభార చయ మిందు స్వల్పమైన
ప్రేమపూర్వకముగ నవి పెట్టఁబడును.

గములు గట్టి కసాయి ప్రాంగణముఁ జొచ్చు
నోరులేని యీజీవుల తీరుఁ గాంచి
కరుణ వర్షించు నా పరాత్పరుని శక్తి
కతన, వీనికై మది జాలిఁ గాంచు చుంటి.

పథికుఁడా! నీదు చింతలావలకుఁ ద్రోయు
మైహిక విచారములను మిథ్యలుగఁ గనుము;
ఇందు నరునకు వలసిన దేలవంబో!
కాల పరిమితి యే నధికంబు గాదు.

అకట! నీ భాగ్య కలిత సౌఖ్యంబులెల్ల
స్వల్పములును బ్రతిక్షణ క్షయకరములు
అల్పమగువానిఁ గొండాడునట్టి జడుఁడు
వానికంటెను మిక్కిలి స్వల్పుఁడగును

కుదురుగా నిన్నెడఁదఁ జేర్చి కొనఁగనిమ్ము
కల విచారంబు లెల్ల నావలకు విడుము;
ఒనర, నెడఁబాటు మనకు లేకుండుఁ గాత
నాదు సర్వస్వమును నేను నాది నీవ!

— ౦ —

శ్రీ సాయీనాథాయనమః

# శ్రీ సాయీ సుభాషితములు

భారవులటు సంప్రవృత్తుల
భూరి బ్రహ్మాండ కోటి పోషకులను సం
సార నివృత్తికి లక్ష్మీ
నారాయణులన్ మనంబునన్ ధ్యానింతున్. 1

సాధుచరితముల్ మనకెప్డు బోధఁ జేయు
జీవితంబుల సఫలంబుఁ జేయు సరణి
తనువులను వీడినను వారలునిచినారు
కాలసైకత స్థలమునఁ గాలి జాడ 2

కూర్పు, వస్తువుల్ వర్ధిల్లు కోఁటకు మున్నె;
పవలె గడియింపు రాత్రికే యవసరంబొ;
వయసుననె చేర్పు ముదిమి కైవలయు వాని,
సేకరింపు మిందే పరలోకమునకు. 3

కాంచనంబుఁ గూడు గాజైన మరకత
కాంతు లీనుచుండు మంతుకెక్కి
సాధు జనులఁగూడి చరియించు జడుఁడేని
గాంచు చుండు లోకగౌరవంబు. 4

ఎవని యునికిచే ననేకులు జీవించు
మంత్రము, వాఁడె బ్రతికి యున్నవాఁడు
పొట్ట నింపుకొనుచు మూకొక్కఁడనఁ గాక్కర
బ్రతుకఁబోదె! వేయి వత్సరములు. 5

దాన మొసఁగు దేని దాపలి కేలునీ
వలపల కరమేమి సలుపుదాని
నెఱుఁగకుండ నిడుమి; యీవివిధానంబు
నెఱుఁగ జాలువార లెందొకలరు ! 6

సత్యవస్తువునకుఁ జక్కదనంబులు
రంగుపూత, లొప్పు వ్రాత లేల ?
గుణము చెడఁగఁ బోదు గుణమును గుఱుతింపఁ
బోనివాఁ డొకండె పోలియుఁ గాని. 7

హరి కృపా లేశ సంప్రాపితార్థ మెపుడు
వెలికిఁ బ్రకటించుకొని నీవు వెలితిఁబడకు,
అట్టిదానినిఁ బరమ గోప్యంబు గాగ
నిలుపుకొను దేని శ్రేయంబు గలుగు నెపుడు 8

గ్రంథ సముదయంబు గాలించి శోధించి
బ్రహ్మ నెమక నేల శ్రమలఁబడెదు;
గ్రంథ శోధనంబు భ్రమకారణంబని
యెఱిఁగి తలఁపు మెపుడు హృదిని హరిని. 9

హృదయమందు నిలుపు మీశ్వరు నెవ్వేళఁ
జలుపు విధులు దైవసాక్షికముగ,
బుద్ధి మనసు లేకముగఁ జేసికొని, కర్మ
ఫలమునందు కాంక్ష వదలి నడపు. 10

సకలవస్తు లొకటి సర్వేశు మఱి యొంట
త్రాసునందు బళ్ళెరముల నిలిపి
స్వానుభవము సాధు జనబోధ గమనించి
తూచి హితకరంబు నాచికొనుము. 11

జగమునందు ఋణము సంబంధమునఁ జేసి
జీవచయము లోకిటఁ జేరుచుండు
ఋణము దీరినంత నెడఁబాయుచుండు న
టంచు మనుత నపనయించికొనుము.

జాతి మత కులంపు చర్చలు వ్యర్థముల్
సకల జీవకోటి జనని యొకటె;
ఎచటబుట్టె నచట కేగును జీవము
లంచుగనుము; భేద మెంచనేల ?

ఈశ్వరుని భజించి యేమేమి కోరిన
వానిఁ బడయుచుండ్రు ప్రాణులెల్ల
నేడొ రేపొ లేక యేడాదికో, యెడ్డా
హరి సమాశ్రయంబు - అవితథంబు.

ఎల్ల భూతకోటి నీశ్వరుఁ జూడఁగాఁ
గలుగు వాఁడె యెఱుక గలుగు వాఁడు;
గురువునందు దేవు నరయుము తొలుదొల్తఁ
బిదపఁ గనుము భూత వితతియందు.

అర్హతను గడించి యడుగంగఁ బొమ్ము యో
గ్యతకుఁ దగిన మాత్ర మడుగు దేని !
బడయఁజాలు దెట్టి వస్తువు నేనియు,
దగని దానిఁ గోరి వగవు గనకు.

పంచప్రాణములును, బంచేంద్రియంబులు,
మనసు బుద్ధ్యహంకరణము లనెడి
పంచకంబు విడక బ్రహ్మంబు గన లేఁడు
ఇతర సాధనంబు లెన్నియున్న.

దిటవు చేసికొను, తితిక్ష విశ్వాసము,
లోర్పు నమ్మకంబు లొనరవేని
శాంతిగనఁడు, సౌఖ్య సంపద దూరమౌ
నితర సాధనంబు లెన్నియున్న. 18

వాదముడుగు మొదట వాఁడు నీమాటఁ బా
టించ వలయుననెడి యిచ్ఛ విడుము;
బుద్ధి ననుసరించి పోవును నరుఁడని
యెఱిగి సతము మౌన నిరతిఁగనుము. 19

దుర్భరంబు దైనందిన దుర్ఘటంబు
కేవలము దోష మిళిత మీ జీవితంబు;
దొసఁగు జాడల విడి వీలు పొసఁగునంత
ఋజుపథంబుననే పయనింపు మెపుడు. 20

అర్థ చింతనంబును మఱి స్వార్థచింత
ఋజు పవిత్ర మార్గమునుండి యెడము సేయు;
ఎదటి వాని మొఱల్ చెవినిడఁడు నరుఁడు
ఆస లీసులు వీని నియంతలగుట. 21

సత్యమాధారముగ నీవు సంచరింపు
మెల్ల వేళల; నపుడు నీ వెటులనున్న
నెందునీవున్న, నేమి కావించుచున్న
విడువ కెప్పుడు రక్షణంబిడుచునుండు 22

నన్ను నమ్మి సతము నన్నాశ్రయించెడి
వాని యింట నెన్నఁడైనఁ గాని
కుడువఁగట్ట నెట్టికొరత వాటిల్లదు
ప్రతినఁ జేసి యిదియె పలుకుచుంటి. 23

జడనిధిఁ జొచ్చిన తటినీ
జడముల నొగిఁ గ్రమ్మరింప సాధ్యములగునే ?
కడ చనిన క్షణము క్రమ్మరఁ
బడయంగానగునె యెంత వారలకేనిన్ 24

ఏవాని యందు నీదగు
భావమ్ములయించుఁ బ్రేమ భయముల కిరవై
యావాని నొకని నమ్ముము
దైవము వైళంబ నిన్ను దగ రక్షించున్ 25

ఈ కనఁబడు ప్రాణి వితతి
నేక గతిన్ గాచువాఁడ నెక్కాలమునన్
నా కరుణ లేక యించుక
యాకేనల్లాడఁ బోవ దనుచు నెఱుఁగుమీ ! 26

పుణ్యఫలముఁ గోరఁ బూనుదురే గాని
పుణ్య మాచరింపఁ బోరు జనులు
పాప ఫలముఁ బడయ నోపఁ బోరెవ్వరు
పాపముల నొనర్ప వలఁతురెల్ల. 27

నేనెట్టివాఁడ నెవఁడనొ
మానసమునఁ దలఁపు శ్రవణ మననంబుల, స
త్యానంద మయుఁడ నౌనన్
గానంగలవీవు - వేఱుగతి లేదు సుమీ ! 28

మనమెవర - మెట్టి వారమొ ?
యెనయఁగనీ 'నేను - నీవు' నెందుందుమొ ? నీ
మనమునఁ దలపోసెదవేన్
గనెదవు 'నీ - నా' యభేదగతి నొగి బిడ్డా ! 29

పగతుఁడని యెవ్వరినిఁ గూర్చి పలుకరాదు;
ఎవ్వఁడెవనికి శాత్రవుఁ డెన్నఁడేని
నెవనిపై నేనసూయ వహింపఁ దగదు;
సకలమేకం, బభేదంబు - సమము - బిడ్డ! 30

కనుమి, నీవిట్టి ప్రారబ్ధ కర్మఫలము
ననుభవింపక దీనిఁ ద్రోయంగ లేవు
వివిధ జీవచయంబు లేవిధులఁ ద్రోచు
వాని వాని ప్రారబ్ధ కర్మాను సరణి. 31

ఆకతన భేద మెల్లెడ వ్యక్తమగును
ధనికు శునకము పరుపుపైఁ దనువుఁ వ్రాల్చు
పఱచు రొట్టెముక్కకు పేదవాని కుక్క-
అరయు మిది తనూ ప్రారబ్ధ మనుచు బిడ్డ! 32

షడ్రసోపేత దివ్య భోజనములైన
సంకటియొ యైన - నాఁకలి శాంతి - ఫలము
జాళువా జరీ నునుపట్టు చేల మైనఁ,
బ్రాత యేన్ - మేను గప్పుట ఫలము - బిడ్డ! 33

కలిమి గలిగిన నమ్రతఁ గనుట మేలు
ఫల భరంబునఁ దరువులు వంగకున్నె?
కుజనముల యెడ నమ్రత కూడ దెపుడు
సాదుల గణింపు, మడఁగి, సమాదరింపు. 34

దాన ధర్మార్థములకు విత్తము వ్యయింపు;
కాని, మితి మీఱి వెచ్చింపఁ గాదు నీకు,
అశ్వరమ విశ్వ; - మందాక యర్థ మవస
రంబ; యైన లోభంబు మోహంబు దగదు. 35

స్వాభిమానము స్వాత్మ ప్రశంస లుడుగు
మితర నిందలఁ బలుక నాలింపఁ దగదు.
అనవరతము 'నేనెవ్వడ' నని విచార
మేమరక సల్పు మిదియె, సంసృతికి ముక్తి. 3

ప్రాణి దేనినేన్ ద్వేష భావమునఁ గనకు
దైవ మెల్లెడఁ గలఁడను తలఁపు విడకు
ప్రేమ దైవంబు - దైవమే ప్రేమ సుమ్మి;
అది యుదయ మొంద సకలంబుఁ బ్రాప్తమగును. 3

ఇతరు లడిగిన నొక్క కాసేని నిడరు
దక్షుఁ డడిగిన వేలును లక్ష లిత్తు
రటుల నీశ్వరుఁ గనఁ గోరినంతఁ గనఁడు
అర్హతను గాంచువాఁడె బ్రహ్మమును బడయు. 3

కనుమి! పూచిన చూతవృక్షమును బిడ్డ!
ఎల్ల పూవులు కాచి ఫలించెనేని
నెట్టిపంట? - పిందెలు కాయ లెన్నొ కాచి
గాలికిని వ్రాలు - పండునవే లవంబొ? 3

స్వాంతమును సంతతంబు భూతాంతరాత్మ
యైన శ్రీవాసుదేవునియందు నిలుపు
మటుల మది దైవమందు లయంబు గనినఁ
గందు సచ్చిదానందైక గమ్యపదము. 40

గగనోపరి స్థలంబున
నెగడఁడు, పాతాళమందు నిలువఁడు సతమున్
దగనీదు దఱిని గలఁడా
భగవంతుని నెమక నెందు పఱతువు బిడ్డా! 41

భోగమున్నచోట మోక్షంబు మృగ్యంబు
మోక్షమున్నచోట భోగ మెడము
సాయిపద యుగాబ్జ సంసేవనంబున
భోగమోక్షములను బొందు జీవి. 42

గమ్యమది నీకు వెలిని నెక్కడనో లేదు;
మందమతి వెదకుచుఁ బోవు నెందొ దవుల;
అతుల నాతఁడు నతిముతి నరుగుచున్న
హృదయ భవన కవాట మాహితుఁడు తట్టు. 43

నరుని ప్రియశిరఃకంపముల్ చిరునగవులఁ
బడయనెచటికో చని కష్టపడెద వేల?
జీవ! స్థిరధృతిన్ గని, యుపార్జించుకొమ్ము
చిరము నీలోన నెగడు నీశ్వరుని చెలిమి. 44

కాదు నాయందు; నితరుముఖంబునందు
నీదు రూపు సాయీ! కననేరవలయు;
ఒరుఁడు తనయందు గాదిట నొనరు నాదు
తేజునన్ గనఁ దగు నీదు దివ్యముఖము. 45

భక్త! సత్యముఁ బాయు టెప్పటికిఁ దగదు,
సత్యమెడసిన నీకీర్తి సమయుసుమ్ము;
సత్యబద్ధలక్ష్మి యొకప్డు చాటువడిన
మరలఁ దనయంతకోరి నీదరికిఁ జేరు! 46

ఇట్టి స్వప్న సంయోగము లింత దనుక
నీవు పాంచభౌతికముగ నెఱిఁగియున్న
యన్ని సంఘటనలటు యథార్థములుగ
సత్యములుగ భావించుటల్ చనును బిడ్డ! 47

ఓమ్

నమః శ్రీకృష్ణాయ భగవతే

శ్రీ సాయీ సద్గురవేనమః

# శ్రీ సాయీ కబీరు సూక్తులు

వందనము (ద్విపదలు) గురువు గోవిందు లొ - క్కట నిల్చిరెదుటఁ
బలుఁగ నెవ్వరికాళ్ళఁ - బడువాఁడ మొదట ?
హరిదర్శనంపు భా - గ్యముఁగూర్చు ప్రోడ !
గురుసాయి ! నీక మ్రొ - క్కుచునున్నవాఁడ. 1

గురువు వెలయుఁగ గురువు గో - విందు లేకంబు
వెలికిమాత్రంబ క - న్పించు లోకంబు.
నరుఁడహంతను బాసి - నమ్మి కొల్చుదును
హరి పరేశుండు ప్ర - త్యక్షంబ యగును. 2

గురుసేవ జనసేవ - గోవిందు వినతి
పరమ విరక్తి నాఁ - బడు నాల్గు జగతి,
మోక్ష సంప్రాప్తికి - మ్మూల సాధనములు
అక్షీణ సుకృత జ - నైక లభ్యములు. 3

హరికృపన్ మనుజున - కవతారుఁడైన
పరమాత్మ గురువు చొ - ప్పడును జగాన;
గురుకృపన్ గనఁడేని - గురు భవార్ణవముఁ
ధరియింపలేఁడు సుం - తయు; నిది ధ్రువము. 4

గురుదేవు నుపదేశ - కోటిచేఁ జిరము
పొరిఁబోవు వాసనల్ - మోహ సంచయము;
జ్ఞాన గంగను కల్మ - షముఁ బాయునతఁడు
స్నానముగ వే వేల - మనుజులం దొకఁడు. 5

జ్ఞానబాణము గురు - స్వామియే యడును
జ్ఞానేంద్రియంబు లం - తర్ముఖంబగును
కనఁడు వినఁడు ప - ల్కఁడు చరింపండు
అనయము పిచ్చివాఁ - డటుల శిష్యుండు. 6

హరి హర బ్రహ్మాదు - లైననుగాని
సురలు మునుల్ మహ - ర్షులు యోగులేని,
గురు భవాంభోధి స - ద్గురుబోధఁదక్కఁ
దరియింపరన్న, ని - తరు లేమిలెక్క; 7

అమితాశ గలిగిన - యట్టి గురుండు
నమిత లోభాత్మకుం - డైన శిష్యుండు
మునుఁగు వారల, భవాం - భోనిధిలోనఁ
జను రాతి తెప్పపై - జనువిధాన. 8

తను తాపములు మోహ - తమసం బడంచి,
ఘన భయ హర్ష శో - కములఁ దూలించి,
నమచి త్తవృత్తి నొ - సంగు వేద్యుండు
నమల బోధానందుఁ - డతఁడే గురుండు. 9

తనువు మనంబును - ధనము సర్వంబుఁ
బొనరింపనగు గురు - వున కప్పనంబు,
మాయకార్థంబులు - మమతఁ బో విడుము
సాయి రాముఁడు సమ - స్తముఁగాఁగ మనము. 10

స్వీయకుటుంబంబుఁ - ద్రెమింపువిధము
సాయి రామునిఁ గనఁ - జాలిన జనము
గురువు సర్వంబని - క్రొలుచునరుండు
పరమపదంబుఁ ద - ప్పక పొందుచుండు. 11

**సాధువులు**

సరసు లంబుదములు - సాధుజనంబు
తరువులు నీనాల్గు - ధర ననిశంబు
పరులకు నుపకృతుల్ - పఱుపఁగాఁ గోరి
ధరియించు చుండును - తనువు లవ్వారి. 12

తమ ఫలంబులఁ దరుల్ - తా తినఁబోవు,
తమ నీరముల నదుల్ - తా గ్రోలఁబోవు,
పరమార్థమతి సాధు - వరులు దేహములు
ధరియించి పొనరింత్రు - ధర్మోపకృతులు. 13

కన, సాధువగుట నా - ఖర్జూర తరువు
పనివడి నెక్కుటొ - బహుకష్టమొదవు;
ఎక్కినా! - మధురసా - మృతమును గ్రోలఁ
దక్కినా! - భిన్నమ - స్తకుఁడుగాఁ గూలు. 14

చల్లని మనమున - సావధానతయు
ఫుల్లిత కాయమే - పునఁదోఁప; మఱియు
కన, వికారము లేక - గంభీరమమర
ననిశము ధైర్యద - యాదృష్టి తనర. 15

కామితంబుల వీడఁ - గని, వైరముడిగి,
ప్రామిన ప్రేమ నీ - శ్వరునందుఁ గలిగి,
యలరు నాతఁడు సాధు - వనఁబడుచుండు;
పొలుచు నియ్యవి సాధు - వులఁ బాయకుండు. 16

ఆయత మోహంబు - నాశల నడఁచి,
మాయఁ గడచి, యభి - మానంబు విడిచి,
పొరయు హర్షము శోక - మును బాయునతఁడు,
పరనింద సలుపని - వాఁడె సజ్జనుఁడు. 17

పరిపూర్ణ సంతోష - వారిధి మునింగి
బొరి నాపదల్ - బాసంగినం జెలంగి,
ఒకర నాల్గుమఱుంగు - లుత్సాహమూని
తనపూర్ణ నెఱవు నా - తండెసుమ్మి జ్ఞాని. 18

చేతిమిఠాయిం తి - నిన, రుచిలేని
నోంత్రింది దొరికిన - నెదం గుందంబోని
మనుజుండు, రామ నా - మమున రమించు
జనుండు, 'బైరాగి' నా - జగతిందీపించు. 19

కుడువ చిచ్చును నార్పం - గలుగు నన్నంబు,
నొడలిని గప్పంగ - నొనరు చేలంబు,
కన్న నన్యములగు - కాంక్షల వదలు
నన్నరుండే "ఫకీ" - రన నిల వరలు. 20

మంచివానిని మంచి - మనుజుండుం జేర
మంచిపలుకులు పొల్చు - మనసు లింపార;
ఖరము ఖరంబును - గదిసెన యేని
మరు పదతాడన - లొనరు నెంతేని. 21

హరి భక్తసఖ్యంబు - హరిచింతనములుం
బొరి లభ్యమగును గా - వుత మహర్నిశలు;
నా కోరందగినది - నా కోరునదియ
యా కొలందిమ్ము సా - యీ! దయాహృదయ! 22

సాధనము పడిపంచంగాచి దు - ర్భాషలాసైచి,
పడరానిబాధలం - బడి వేచి, వేచి,
కనుసన్నలను మెలం - గంగలేని నరుండు
ధనవంతుకరుణం బొం - దంగ నేరం డెపుడు. 23

పంచేంద్రియాల్ వృష - భములు క్రొవ్వెసఁగ
నంచితగతి నిటు - నటు లాపి సురుఁగు;
వానిఁ జక్కఁగఁ బట్టు - వాఁడె ధీరుండు
ప్రాణికోటికతండు - వందనీయుండు 24

మసిగూడు సుమ్మి సం - సారంబు; దీనఁ
బొసఁగఁ బ్రవేశించి, - మురికిఁ దా మేనఁ
దవులక వెలువడు - ధన్యజీవుండు
ప్రవిమలుండాతండు - వందనీయుండు. 25

తరణి తోఁచెనయేనిఁ - దమసం బడంగు,
గురు బోధమునఁజేసి - కుమతి తొలంగుఁ;
బొలియు లోభమున స - ద్బుద్ధి లోకమున
మలఁగు భక్తియు నభి - మానంబు వలన. 26

వెలయు వైరాగ్యంబు, - విషయముల్ విడువఁ,
బొలుచు జ్ఞానము సమ - బుద్ధి పెంపొదవ,
సకల భూతదయా ప్ర - సారంబు కతన
ప్రకటమౌ జగతి స - ద్భక్తి భావమున. 27

ప్రాణులన్ దయయు, ధ - ర్మాచరణంబు,
ప్రీణనోపకృతి, యిం - ద్రియనిగ్రహంబుఁ,
బఱఁగ నీ నాలుగు - వసుమతియందు
హరిభక్త చిహ్నంబు - లై నెగడొందు. 28

మనసును నిలిపి గ - మ్యముఁజేరు దనుక
పెనయు కష్టములకు - వికలతఁ గనక,
పరమార్థదృష్టి యె - ప్పటున విడక,
చరియించు భక్తుండొ - సాధు వేమఱక. 29

సోమరీ! లెమ్మిటు - సుప్తినిఁ గన్న
నేమిఫలంబు నా - ర్జింతువో? యన్న!
యమధామమునకుఁ బ్ర - యాణమాతఁడని
నమరు నీ తోడుగు లిం - దన్ని రాలెడిని. 36

నిద్దుర మృతికి స - న్నిహితమౌ మచ్చు,
నిద్దుర విడి భవ - నిర్వృతి నిచ్చు
హరి రసాయనమిదే - యానుమో బేల!
పెర రసాయనము ల - న్వేషింప నేల? 37

వ్యసనంబులందున - ధ్యానించు హరిని
పొసఁగు సౌఖ్యముల రా - మునిఁ గన రవని;
చిర సుఖంబుల హరిన్ - సేవింతురేని
నరులు గాంతురె? వ్యస - నం బెన్నఁడేని. 38

హరినిఁ దలంపుఁడీ! - యనిశ మర్థించి,
పొరలు సౌఖ్యముల రా -ముని విస్మరించి
పొసఁగు దుఃఖముల వా - పోయ మిమ్మోము
అసదైన రక్షకు - నరయఁగాఁ బోము. 39

ఐక్యము 'నీవు కర్తవు' - 'నీవు' - నీవన్న నేను
దేవ! నీయందు డిం - ది ద్రవించె 'నేను';
భవదీయ నామ ప్ర - భావ సంపదల
ధ్రువము సాయీ! నీవ - తోతు వెల్లెడల. 40

'నేను' న్న దనుకఁ గ - న్పింపఁడు గురుఁడు
'నేను' లేదు, గురుండు - నెగడుట నిపుడు;
అరయఁగ నొక రాజ్య - మందున లేఁడు
లిరువు రుంటఁ బొసంగ - దేమొ? యేనాఁడు. 41

కలుగదు ధైర్య మే - గతిఁ బ్రేమ లేక,
వెలయఁబోదు విరక్తి - విరహంబు లేక,
హృదయ మాలిన్యంబుఁ - బ్రిదుల దన్తోక
సదమల గురుకటా - క్షంబునఁ గాక. 42

స్నేహంబు నిలుపుట - నేర్పరితనము
ఐహికసుఖము లే - వైనఁ బోవిడుము;
తను వేని మన మేనిఁ - దల యేనిఁ దుదకుఁ
జననిమ్ము కాని, నీ - సఖ్యంబువిడకు. 43

సరవిని నెనిమిది - జాములయందుఁ,
గర మరువదినాల్గు - గడియలయందు,
శ్రీరాము మఱువక - చేయు సఖ్యంబు
వైరాగ్యమను పేరఁ - బఱఁగు నిక్కంబు. 44

మాధవ విరహా క - మండలు వమర,
సాధిత వైరాగ్య - చక్షువుల్ తనర;
హరి దర్శనంపు భి - క్షార్థినై సతముఁ
జరియింతుఁ దన్మయా - సక్తి నేకతము. 45

అల విరక్తియు, విర - హ వ్యసనములు
పలుకరానివి; స్వాను - భవ వేదితములు;
కలలోన నేమేమొ - కను మూఁగవాఁడు
తలఁచు లోలోన సుం - తయుఁ జెల్ప లేఁడు. 46

అధికారి అవలీల సుఖముగ - హరి లభ్యమైన
నెవఁడు కష్టము లోర్వ - నెంచు లోకాన ?
కామ కోపాశలఁ - గడచినవారు
రామ సాయీశ ద - ర్శన మొందువారు. 47

రామనామం బొగి - గ్రహియించువాఁడు
భూమిపై శ్రుతి తత్త్వ - ముల నేర్చువాఁడు;
కన, రాము విడిచి దు - ర్గతిఁ గన్నవాని
మనుపఁగాఁ జాల వా - మ్నాయంబులేని. 30

సార్థక జన్ముఁడు

ప్రేమపాత్ర మెవాని - హృదయంబు కాదో?
రామనామం బేని - రసనాన నిలదో?
అట్టి నిరర్థకుం - డైన నరుఁడు
పుట్టుచు నవనిపైఁ - బొలియుచు నుండు. 31

పసరముతోలున - వస్తులెన్నైనఁ
బొసఁగు; నరునిచర్మ -మో గవ్వకైన
గా; దా నరుండె న - త్కర్మఁడేయైన
ఆదినారాయణుం - డగును జగాన. 32

ఈ మాయజగతిఁ గ్రీ - డించు మానసము
రామునియందట్లు - రమియించ, నిజము,
నక్షత్ర మహిత మం - డలము భేదించు
నక్షీణ సుఖద ది - వ్యపదంబుఁగాంచు. 33

కోరి స్మరింపుఁడీ - గురుని నామంబు
ఆరడమునఁ జేయుఁ - డన్నదానంబు
భవవార్ధిఁ దరియింత్రు - స్వాధీనమతులు
అవిసి కూలుచునుందు - రభిమానయుతులు. 34

ప్రబోధ

అలస! సల్పుము సాయి - హరినామ జపము
మెలఁకువఁ గనుము! ప్రా - మినన్నిద్ర విడుము;
కాళులఁ జాపి దీ - ర్ఘ సుషుప్తిఁగాంచు
కాలంబు చేరువఁ - గలదని యెంచు. 35

కనిమసంగక మేను - కాంతుని సుఖము,
ప్రసవ సంకటము లో - ర్వక సుతోదయము
చక్క - లభింప దే - సాధ్వికైనఁ
దక్కఁ డీశుఁ డత ప్త - తనున కెందైన. 48

వదలక విరహ తా - పము ప్రకోపించు
పదపడి ప్రేమ పి - పాస జనించు,
నెట్టన నివి రాము - నిన్ బొందఁగలుగు
నట్టి సద్భక్తు యో - గ్యతలాచుఁ జెలఁగు. 49

ప్రాకృతములు వెలయుంగ లక్షల - విలువయేయైనఁ
అస్థిరములు బొలుపార రతనముల్ - పొదిగినదైన
భువి దేహభవనము - మూన్నాళ్ళపొంగు
తవిలి కాలము సమ - స్తము దిగమింగు. 50

స్థిరను దోఁచు సమ స్త - జీవ వృ త్తంబుఁ
బరికింతుమే నిది - స్వప్నతుల్యంబు;
కనుదెఱచిన యంతఁ - గలలోన వరుఁడు
కొనినవి, యిడినవే - కొంచెమేన్ గనఁడు. 51

జీర్ణపోతము మేను, - చెడు మోసగాఁడు
కర్ణధారుం డహం - కారమన్ వాఁడు;
భవవార్థిఁ దరియింతు - బరువులేకున్నఁ
దవులు వాసనల మో - తను గ్రుంకు దన్న! 52

అలస! లెమ్మా! కాలుఁ - డదె డాసెనోయి!
మెలఁకువఁ గనుమింక, - మేఁకన్ గసాయి
బలిమిఁ జెవుల్ పట్టి - బలిపీఠిఁ జేర
నెలమి లాగెడి మాడ్కి - నిన్నీడ్చునోర! 53

దోసిటంబట్టిన - తోయంబులెందు
పోసటం దొఱగెడు - బిలమార్గమందుం;
గనుచుండ నాయు వా - కరణిని డిందు
క్షణమాత్ర మృత్యు వా - సన్నంబునొందు. 54

ఈనాండో! రేపో! లే - కేనాండో! కాని
పోనాడి సకలముం - బోలయనివానిం
గనంబోము రాజైనం - గడుపేదయైనం;
గనుమోయి! మెలంకువ - గతి నింతనైన. 55

ఎముక లింధనముల - గ్లెరియుచు నుండ
గమి కేశములు పూరి - గతి మండుచుండ,
నజిముజి మటుమాయ - మైపోవు జగము
నరసి యుదాసీనుం - డగుయోగి నిజము. 56

సలిల బుద్బుదము లీ - జంతు దేహములు
పోలియును గన్నుల - ముం దనిత్యములు;
ప్రిదులక రేయెల్ల - వెలుంగు తారకలు
ఉదయమం దడంగు నెం - దో జాడ లురలు. 57

కాలము అస్థిరత్వము దివసముల్ పుత్తువు - తిండి త్రిప్పాలకుం
దవిలి త్రోయుదువు రా - త్రములు నిద్రలకు,
మానికం బట్టి జ - న్మము గవ్వకైనం
గానీక వెచ్చింతు - గాదె! లోకాన. 58

మానిత కాలమా! - మాయమైపోయె
జ్ఞానమేన్ గురుభక్తి - గాని లేదాయె!
ఇప్పుడేడ్తువు; పక్షు - లిలం బంటం దినెను!
చప్పటుల్ చఱచ నే - సార్థకం బగును? 59

రేపందు వీనాఁడు; - రేపు రేపందు
వీపగిదినిఁ గాల - మెడపె దేమందు ?
రేపుకు రేపున్న ? - రేపొక్కదినము ?
ఓపి నేఁడే పను - లొనరించుకొనుము ! 60

ఈనాఁడ రేపటి - దెల్లఁ గావింపు
మీనాటి దిప్పుడే - యెలమిఁ బూరింపు;
కాలపురుషునిచేతఁ - గలదు కాలంబు
కాలంబు నీకు లొం - గనిది; నిక్కంబు. 61

గడె పైననేమౌనొ - కన నీకుఁ గాదు;
తొడరి రేపనెడి దెం - దును నమ్మరాదు;
పావురంబును డేగ - వలెపొంచి త్రుంచు
నీవెన్క మృత్యు; వీ - నియతి నూహించు. 62

వ్యర్థ ప్రయాసలు నిర్మించుకొంటివి - నిస్తుల భవన
మర్మిలిఁ దరతరా - లంతు సౌఖ్యమున
వసియింప; నెంత కా - వలెనొ ? కన్గొర !
పొసఁగ నాల్గో య్యెదో - మూరలమేర. 63

ఒనరు నీ యీ తను - వొక పచ్చికుండ
కనఁబోకు గర్వ, మే - గతి నమ్మియుండ
రా; దించుకేని నీ - రము సోకినంతఁ
జేఁదాల్ప లేవు; వే - చెడిపోవు నింత. 64

ప్రాకృత విషయముల్ - పలుకుచు వినుచు
నీకాలమెల్ల డిం - దెను, మోసమనుచు
నాస క్తిమై నిఁక - నైనఁ బ్రోయకుము
శ్రీసాయికీర్తి భా - షింపుము; వినుము. 65

పోడమిన ప్రాణులు - పోలియు నెందేని
నోడయఁడేన్ బంటేని - నొక ఫకీరేని,
నొంట సింహాసనం - బొంట సంకెలలు
గెంటి, చేరును జము - గీము జీవములు. 66

కాలచక్రము విడివడు మార్గము
అగుణంబు సగుణంబు - నను శిలాద్వయము
తగ రేఁ బవళ్ళు నెం - తయుఁదిర్గు చిరము
కాలచక్రము తిరు - గలి; దానినడుచు
ప్రాలి జీవులు నల్పఁ - బడుచుంటఁ గనుమ. 67

కాలచక్రము తిరు - గలిశీలఁ జేరఁ
జాలిన గింజలు - సమయవు; దూర
దూరంబుఁ జనునవి - తోడన డిందు;
శ్రీరాముఁ జేరిన - జీవి మేల్పొందు. 68

సాయిఁ గొల్చెదవ? యీ - క్షణము కానిమ్మ,
పాయక పురుషార్థ - ఫలముఁ గైకొమ్ము;
కసిమసమై క్రాగి - కడు వ్యథల్ గాంచు
పసువుకొమ్మదె వన్నె - వాసి నార్జించు. 69

వ్యాపియై, యేకాంశ - మందుండి దీని
స్త్రీ పుంస జగమును - సృజియించు వాని
రాముని గను మంత - రంగంబునందు
నా మెయి నిఖిలంబు - నందునఁ గందు. 70

ప్రాపంచ కాత్మనాఁ - బడు రామసాయి
వ్యాపించి జీవాళి - యందుండె నోయి!
నీవ యీనిన్ను బం - ధించుకొన్నావు
నీ వివేకముఁ బాసి - నేరకున్నావు. 71

నిద్రింపకుఁడు, లెండు - నిద్రమేల్కొనుఁడు
నిద్రపై నాసక్తి - నెఱిఁ బాపికొనుఁడు
కలఁగాంచరే? రాత్రి - కాలమం దెపుడుఁ
గలయ సుమ్మీ యీ జ-గంబని కనుఁడు. 72

**ఆత్మ-సుస్థిరత** మనసు నశించిన - మాయ రూపఱిన
పెనుసంశయంబులు - ప్రిదిలిపోఁ గనిన
వివిధ దేహంబులు - విలయ మొందినను
అవినాశి సాయీ ప-రాత్మ కేమగును ? 73

నరుఁడ వీవేసుమ్మీ! - నారాయణుఁడవు
పొరి, దేహమేనను - బుద్ధిని విడవు;
కని వివేకము, సత్య - గతిఁ గనుగొమ్ము,
క్షణభంగురమ్ముఁగాఁ - గనుము దేహమ్ము. 74



**లౌకిక-అలౌకిక విషయములు** దోఁచి, మెక్కుచుఁ బ్రోల - తులచేతఁ జిక్కి
నీచదేహమును గ - ణింతు వీ చక్కిఁ,
జరమయాత్రకు నీవు - చనుడు నొక్కంట
గరికపోచయు రాదు - కదలి నీ వెంట. 75



అరయ నిజస్థితి - యనెడి యంబారి
పఱఁగు వివేక ద్వి - పంబుపైఁ జేరి
సంచరింపుము; ప్రపం - చ శ్వానభయము
గాంచ; వానంద స-ద్గతిఁగందు ధ్రువము. 76

ప్రాపంచకార్థ సం - ప్రాప్తి నన్యులకు
నోపక హరిభక్తుఁ - డోడనీ తుదకు
నట్టియోటమిఁ జేసి - హరి నొందఁగలఁడు;
పట్టి ప్రాకెన - యము - ద్వారమున్ గనెడు. 77

ఇంతకాలము గురు - కృప కాసపడవు
గంజెద్దువలె తిరు-గాడఁ జూచెదవు;
చక్కెరగోనెలఁ - జక్క మోసెదవు
పొక్కుచు నక్కటా! - పూరి మేసెదవు. 78

చదువు లెక్కలుఁ బల్కు - చతురిమ లెల్లఁ
గదురుటల్ కష్టముల్ - గా; వవి పొల్ల,
మనసు నద్దుటలుఁ గా-మ వినాశ కృతులు
కన దుష్ఘటంబు లా-కాశ యానములు. 79

అడఁపు కామముఁ, గ్రోధ-మడపు, కోరికల
నడఁపు; మీ కలుగు మా-నావమానములు,
గురు దయాదృష్టికిఁ - గుదురైనవాఁడు
తఱిసి యా జమున కొఁ-దల నొగ్గఁబోఁడు. 80

పలుకు పొంకము

పలుకు పల్కన కెంతో - వాసి చొప్పడును
తలఁపు మేల్ పలుకు చి-త్తమున నెప్పుడును,
పరమాత్మ లభ్యమా - పలుకులే సతము
పరికించి వాని ను - పార్జించుకొనుము. 81

పలుకుము చల్లని - పలుకుల సతము
మలయనీయకు మఖి - మానమే లవము;
మిత్రులు నీలోన - మెలఁగుచున్నారు
శత్రులు నీయంద - చాఁగుచున్నారు. 82

కాక మెవ్వని కన - కము దోఁచికొనియె
కోకిల యెవనికే - కోటీర మిడియె,
మానుగ నెవనికి - మంచినోరెసఁగు
వాని కీజగము కై - వారంబు లొసఁగు. 83

ఎవనికి నాలుక - యొప్పు డధీనమ్మొ
వాని కీజగమెల్ల - వశవర్తి సుమ్ము;
కానిచో నవగుణ - ఖని యగునంచు
జ్ఞానాఢ్య సాధు సం - చయము భాషించు. 84

పరిదేవనము పలుకు భాగ్యములు లే - వని ఖేదపడకు
పలువరింపకు మన్న - పానీయములకు
హృదయమందిర విహా - రిని రాముఁ జొలుము
సదమలానంద రా-జ్యము నేలికొనుము. 85

నీకు మ్రొక్కులు సాయి - నిన్నెఱ నమ్మి
మా కుటుంబమున కీ-మాత్రంబ యిమ్ము;
చేకొని మము, మమ్ముఁ - జేరు సజ్జనము
నాకలిచేఁ గుంది - యడలనీయకుము. 86

ప్రభువు సమర్థత పొందుగ నీభార - మును సర్వమూని
ముందువెన్కలఁ జను - భూసుతా జాని;
కుందెదవేర ? క-న్గొను రామసాయి
మందుఁడా! సర్వ స-మర్థుఁడౌనోయి ! 87

మొదటనే నెలబత్తె - మును నిచ్చువాఁడు
పిదప నీసేవ న - పేక్షించు వాఁడు
శ్రీసాయి; యతనికి - శిరమిడి వేల !
మోసబుద్ధిని దేహ - మును దాచుదేల ? 88

లోలత్వమును మోహ - లోభముల్ మదముఁ
దూలించి నిత్య సం-తుష్టుఁడై చిరము
హరిభక్తుఁ డేకాకి - యగుచు లోకమునఁ
జరియించు; వని మృగ - స్వామి చందమున. 89

ఏకైక కారణం - బీ నీమనంబు
నీ కోరు గతిఁ బయ - నింపు; నిక్కంబు
భావంబ - సద్గురు - భక్తిఁ బొందించు
భావంబ - విషయాబ్ధిఁ - బడఁద్రోసి ముంచు. 90

నిదురను మనసు తా - నెటి లయంబందఁ
గదలక మెదలక - కాయంబు డింద
వేఁగన్నులను గాఁపు - వెట్టి, తా మగుడ
నీకిడు హారిని గ-ణింపవా ? జడుఁడ !

తీపివస్తువు లన్నఁ - దిందురెవ్వారుఁ
జేపడు చేఁదు లా - శింపఁగాఁ బోరు,
వేఁపరసంబు సే - శించెడి వానిఁ
బ్రాపింపఁ బోవెట్టి - వ్యాధులు నేని. 92

కాంతా కనకములు

భవ వృక్షమున విష - ఫలములు రెండు
దవులు; హేమంబొండు - తరుణి వేఱొండు;
ఇతర విషంబులు - మృతిఁగూర్చుఁ దినిన
మతిమాపి యడఁచు సు - మా ! యివి కనిన. 93

అనలము తనదైన - నన్యులదైన
ననయముఁ గాల్చెడి - నంటుమాత్రాన;
తన సతియైన ని - తర కాంతయైనఁ
దనరుచున్ నరక యా - తనల భోగాన. 94

కాంతలతోఁ జెల్మిఁ - గావించుచున్న
శాంతియు ధైర్యంబు - జ్ఞానంబు సున్న;
సక్తిమోఁ బెక్కులు - చదివియు వాఁడు
భక్తిముక్తిధ్యాన - పరుఁడు గాఁబోఁడు. 95

శ్రీసాయీ కృప

పరమాణువును గిరి - వరముఁ గావించు
గిరిని రేణువుఁగాఁగఁ - గెరలి శిక్షించు;
సకలముఁ బొనరింపఁ - జాలు శ్రీసాయి;
ఒకఁడేని ప్రభు నాప-నోప లేఁడోయి! 96

గురుకృపా లబ్ధిఁ - గుదురైనవాఁడు
పరమమౌ జ్ఞానసం-పదఁ గాంచువాఁడు;
నరుఁడయ్యు నారాయ-ణత్వంబుఁ గనెడు
పురుగు భృంగత్వంబుఁ - బొందుటఁ గనుఁడు 97

మౌనము

వాద వివాదంబు - పటు విషాన్వితము;
ఏదిపల్కిన మౌన-మిది సు నిశ్చితము;
మూకత్వమును దాల్చి - మోక్షసాధకుఁడు
శ్రీకాంతు నెడద స్మ-రించు; వాకొనఁడు. 98

దూరదేశమున నా-థుం డుండెనేని
కోరి యేదేన్ వ్రాసి - కొనఁ జెల్లుఁగాని,
నెఱి, తనూ మనముల - నేత్రాల మెలఁగు
హరికెట్లు సందేశ - మంపుటల్ పొసఁగు? 99

సమదర్శి సద్గురు - సాయి కృపాబ్ధి
సమకూర్చె నిశ్చల - జ్ఞాన ప్రలబ్ధి;
ఏ నెటఁగన హరి - నే కనుగొందుఁ
గాని, యన్యంబెదేన్ - గానరాదెందు. 100

పలుకులు గెలిచిన-వాఁడు మానవుఁడు
చలచిత్తమును నిల్పు-జనుఁడు నిర్జరుఁడు
ప్రత్యగాత్మానంద - రతుఁడు సాధుండు
సత్యమంచిటు జ్ఞాని-చయ మాడుచుండు. 101

పంచదారయ యాట - వస్తు కారణము
ఎంచ, బొమ్మలఁ జక్కె - రే తోచు నిజము;
అటుజగంబెల్ల బ్రహ్మమునుండి పుట్టు
అటు జగంబందు బ్రహ్మంబ చూపట్టు. 102

జీవన్ముక్తుఁడు గగనమంటెడు చెట్టుఁ - గల మేటి పండు
నెగిరి తినెడి పక్షి - యెదో యెందో యుండు;
శ్రమకోర్చి యా పండు - చవిఁజూచువాఁడు
విమల జీవన్ముక్తి - విధి నొందువాఁడు. 103

కనకాదులను గాంక్షఁ - గనినఁ బైఁబడును
పెనుమోహ మనియెడు - పిడుగు నీతలను;
గురుబోధ మనమునఁ - గుదురుగ నిడుము;
చరియింపు నిర్భయ - సరణి నేకతము. 104

సరవి మూలాధార - చక్రంబు దృఢము
పొరయ, నధోవాయు - వును నూర్ధ్వగతముఁ
గావించి, పిదప హృ - త్కమల మార్గమున
జీవు బ్రహ్మబిలంబుఁ - జేర్చి నీ మమున. 105

ధారగా గగన సౌ - ధమునుండి జాలు
వాఱు దివ్యసుధా ద్ర - వంబును గ్రోలు
చుందుగు సాధులౌ - యోగిపుంగవులు
పొందుగ హరిపదాం - భోజ భృంగములు. 106

స్థిరత నవద్వార - దేవాలయమునఁ
బఱఁగు పరంజ్యోతిఁ - బరికించు జనున
కరయఁ గాశీక్షేత్ర - మగును కాయంబు
మఱి, ద్వారకయె బుద్ధి; మక్కా - మనంబు. 107

శ్రమకు బత్తెము లేని - ప్రభు సేవనంబు,
నమల బుద్ధివిహీన - మైన జన్మంబు,
జ్ఞానసమేతంబుఁ - గాని యోగంబు,
ప్రాణ గొడ్డమఁ బరి - హాసాస్పదంబు. 108

చేరి చెప్పటకాని, - చేయఁగాఁబోని
వేటిడి వంచించు - విశ్వమున్; గాని,
తగురీతి శిక్ష నం - త్యమున నాతండు
భగవాను కొలువు లో - పలఁ బొందుచుండు. 109

చరమసూక్తి నవ్వి రెల్లరు, రోద - నముఁ జేయఁ గంటి
విశ్వసుధను జని - యించుడుఁ; దొంటి
కరణి నల్వురు నవ్వఁ - గాఁబోని చొప్పఁ
బరికించి యింత నేన్ - బయనించుటొప్పు. 110

భువన పటాటోప - ములఁ ద్రోసినాము
అవినాశ ధామమే - మరుగుచున్నాము
వెంటవచ్చెడివారు - వెడలి రా రండు!
ముంటిమార్గం బిది - మునె కనుగొండు. 111

పొసఁగ నివాసంబు - ముండ్లపైఁ జేర్చి
విసము బోనముగఁ దృ - ప్తినిఁ బొంద నేర్చి
రేయింబవళ్ళు జా - గృతిఁ గనువానిఁ
గాల మేమియొనర్పఁ - గల దెందు నేని? 112

జ్ఞాన విజ్ఞానులుఁ - గవులుఁ బండితులు
వేనవేల్ జగతిఁ దీ - పింత్రు వేగతులు;
ఒనర నింద్రియ నిగ్ర - హుఁడు రామరతుఁడు
కనరాఁడు వేలు ల - క్షలకు నే నొకఁడు! 113

నలువును కాటు కే-నాఁడును విడదు,
తెలుపు వన్నియను ముత్తెము గోలుపడదు;
కుటిలతఁ బాయఁడే - కుతలి దుర్జనుఁడు;
అటు శాంతిఁబాయఁ డెం-దైన సజ్జనుఁడు. 114

అధికత సిద్ధించు - నడఁకువఁ గనిన
అధికతఁగన - ప్రభు వరుగు దూరమున,
చిన్నదై చీమ భ-క్షించు గుడంబు,
మన్ను నెత్తినతాల్చు - మత్తగజంబు. 115

తగ స్వర్గ మర్త్య పా-తాళలోకముల
నెగడదు సుఖము గ-ణింప వే గతుల
సాయి చింతనమున - సాధు సంగమునఁ
బాయని సుఖము చొ-ప్పడు నెందుఁ జనిన. 116

చెలుపలేవోయి! వ్రా-సిన వ్రాత నొసట;
నరయ వ్యర్థము సుమ్మి - యారాట పడుట;
శరణొంది గురు, హరి-స్మరణంబు విడక
పఱువు - దయా ధర్మ - పరత నేమఱక. 117

ఒకమాటలో బల్కు - చుంటి సత్యంబు
సకల శాస్త్రార్థ వి - చార సారంబు;
పలుకు శ్రీరామ భ-జనము సంతతము
కల, లోకవిషయ వి-కారముల్ విడుము. 118

పేదలు పరమార్థ - వేదు లుత్తములు
సాదులౌ హరిభక్త - జనుల సఖ్యములు
గలిగి, దైహికయాత్రఁ - గడపు మోదమున
జలముల మెలఁగు మ-త్స్యముల చందమున. 119

శ్రీ గురుపాద రా - జీవముల్ ప్రోల
సాఁగిలఁ బడి నతుల్ - సలుపు వే వేల;
కనఁగఁ జాలద కీట - కంబు లేశంబుఁ,
దనకు సామ్యము సేసి - తనువు భృంగంబు. 120

శ్రీ సాయీ కబీరు సూక్తులు సమాప్తము.

— ० —

శ్రీసాయీనాథాయ నమః

# శ్రీసాయీస్మరణ

శ్రీగోవింద పరావతారుఁడవు నిన్ జింతించు భక్తావళిన్
యోగక్షేమ వహుండవై మనుతు, వేదోపూర్వ పుణ్యంపుసం
యోగాధిక్యతఁ జేసి యేఁడుగడవై యున్నాడ వీ పుట్టునన్
రాగద్వేష నివృత్తభక్తి నిడి నన్ రక్షింపు సాయీశ్వరా! 1

మాయాతీతుని నిత్యునేకు విమలున్ బ్రహ్మణ్యు ధీసాక్షినిన్
జ్ఞేయున్ ద్వంద్వవిదూరుఁ గేవలుని సచ్చిద్రూపు శుద్ధాత్ము, నా
మ్నాయాతీతపదప్రవర్తి విమలానందాను సంధాయకున్
సాయీనాథు సమర్థసద్గురు నినున్ ధ్యానింతు నశ్రాంతమున్. 2

కన నీశిరిడి భాగ్యమేమొ నరలోకంబం, దహో! లోకపా
వనులా మాన్యులుచేరి, యందుపనిషత్ప్రామాణ్య గుప్తాంచితా
ర్థనిరూఢిన్ జిదచిద్విశిష్టము పరబ్రహ్మంబు సాయీయభి
ఖ్యనరాకారమునన్ వెలుంగఁ గని నిత్యానందమున్ బొందెడిన్. 3

అరయన్ సాయిపదాబ్జభక్తికలిత స్వాంతుండె ధన్యుండు, వాఁ
డరకా సేనియు లేని వాఁడయినఁ దా నోగాక, లోకంబులం
దరుదా భక్తుని ప్రేమపాశములచే నాకర్షితుండై వికుం
ఠరమన్ గాదని విష్ణువే నతని హృన్మధ్యంబునన్ నిల్చెడిన్. 4

నినుఁ జింతించినవారి పాపచయమున్ నిర్మూలమున్ జేతు స
జ్జనులై నిన్గొలువన్ శుభప్రదమన స్సంకల్పముల్ గూర్తు, భీ
తిని దుఃఖంబును లేమిఁ బాపుదు దయార్ద్రీభూతచిత్తుండవై
జనకోటిన్ గనునీకు సాటిగలదే సాయీ! ప్రపన్నావనా! 5

ప్రతిజీవంబునఁ జేరి చాటుపడి, సర్వవ్యాపియై యీశుఁడై
యతులప్రాణిచయాంతరాత్మయయి, కర్మాధ్యక్షుఁడై, లోకసం
స్థిత భూతాధినివాసుఁడై, హృదయసాక్షీభూతుఁడై నిర్గుణాం
చితుఁడై కేవలుఁడైన దేవుఁ డొకఁడా శ్రీసాయి వర్ధిల్లెడిన్ 6

కనుచుండన్ జను నాయువొక్కదినమేగన్ నాశనంబొందు యౌ
వనమున్, జన్నదినంబు రాదు, జగమున్ భక్షించుఁ గాలుండు, నీ
ధనముల్ బుద్బుదసన్నిభంబులు, తటిత్ప్రాయంబు జీవంబు కా
వున నిన్నే శరణంటి నీయుమభయంబున్ నేడ, సాయీప్రభూ! 7

ఘనవైరాగ్య వివేకశీలములు నాకా లేవు, లేదయ్యె సా
ధన షట్కంబు, ముముక్షుసంపద, విశుద్ధజ్ఞాన మేరీతిఁ గ
ల్గును? సంసారమహాబ్ధి తారకము నాకున్ జూపి, శ్రౌతిప్రబో
ధనిదానంబగు బుద్ధినిమ్ము, కరుణాంతస్సార! సాయీశ్వరా! 8

అరయఁగ నామరూప విలయంబులు లేక, ప్రసాదకాంక్ష స
చ్చరణ సరోజసేవలను సల్పు శ్రిత ప్రకరంబునోమ, నా
దరమున నామరూపములు దాల్చి; స్వలీలలఁ జాటు మేటియౌ
పరమదయాంబురాశి భగవానుఁడు సాయి, ప్రసన్నుఁడయ్యెడున్. 9

యతివర్గంబులకున్ సుపర్వుల కలభ్యంబౌదు వీ మా పురా
కృతమా పుణ్యవిశేష మెట్టిదియొ, శీర్డిన్ నిల్చి మమ్మోము బా
ధ్యత గైకొంటి, సతీసుతాదిబహుళంబౌ నీదు మాయాప్రక
ల్పితమోహాంచితబంధముల్ దునుమరావే! సాయీనాథప్రభూ! 10

తమ్మినెలంతసామి యవతారములెన్నియొ యుండుఁగాక, ధ
ర్మమ్మును నిల్పి, సాధుజనరక్షణ దుర్జనశిక్షఁ జేసి, భ
ద్రమ్ములఁ గూర్చుఁగాక, నిరతంబును నీవలె నార్తరక్షణాం
కమ్మ వహించి, ప్రాపిడనె? కంటికిఱెప్పఁగ, సాయిసత్ప్రభూ! 11

చీమన్ దోమ సరీసృపంబులను, బక్షివ్రాతమందున్ మృగ
స్తోమంబందున, మానవప్రకరమందున్, జేతనాచేతన
గ్రామంబందున, రేపుమాపులను, జాగ్రత్స్వప్నకాలంబులన్
నీమూర్తిక్ గనుబుద్ధి నాకిడవె! తండ్రీ! సాయినాథప్రభూ! 12

ఈమాయాజగమందుఁ గాననగు నాయీప్రాణిసందోహమున్
వ్యామోహంబున స్వీయకామపరితృప్త్యర్థంబుఁగా నెంచుచు
ద్దామభ్రాంతినిఁ జూచుచుంటిఁ బరతత్త్వజ్ఞాన బోధార్థమా
నీమూర్త్యంతర మాట నేమఱితిఁ దండ్రీ! సాయీనాథప్రభూ! 13

ఆనందంబగునేని, నయ్యది త్రికాలాబాధ్యమై, భీతిల
జ్ఞానిర్మూలనమై నిజానుభవ సచ్ఛాస్త్రానుకూలంబునై
ప్రాణిక్షేమకరంబునై, ప్రకటితాద్యంత్యాంతరైకంబునై,
రాణింపన్ వలదే యపేక్షితసుఖార్థం బెందు,? సాయీశ్వరా! 14

క్షణికంబై, భయలజ్జలక్ బెనసి, సచ్ఛాస్త్ర స్వకీయానుభా
వనిరూఢిన్ వెగటై, వినాశకరమై, ప్రారంభమధ్యాంతిమం
బున భిన్నంబయి పొల్చు లౌకికసుఖంబున్ గోరి యానందమం
చనుభూతిన్ గనునాదుబుద్ధి సరిచేయన్ లేవె? సాయీశ్వరా! 15

ఏదేన్ గోరికచేసి జీవములు నాయీచేతనాచేతన
హ్లాదంబున్ బ్రకటించి ప్రేమయది యున్నట్లుల్ ప్రదర్శింపరే?
యాదార్థ్యంబగు ప్రేమపాత్రమవు నీవా దింక, వేఱొండెడక్
లేదంచున్ గనుగొంటి స్వానుభవ పాళిన్ జేసి, సాయీశ్వరా! 16

గ్రహశుభ యోగదృక్కులును గాలవిధానము లేల? యీదురా
గ్రహు లగుమిత్రబాంధవ నికాయము పంచలఁజేర నేల? ని
ట్లహరహమర్థలబ్ధికిఁ బ్రయాసలు పొందగ నేల? నీయను
గ్రహమది యున్ననిట్లుఁ గడు గాసిల నేపని? సాయిసత్ప్రభూ! 23

వలదీపద్ధతి, చేయుమీపని జయప్రాప్తిన్ గనన్ జాలు దీ
వలనన్ బొమ్మని చెప్పఁగాఁదగదె దేవా! వ్యర్థమానాశలన్
గలిగింపన్ బనియేమి - వానికయిప్రాకన్ జేయఁగానేల? యా
వల నేడ్పింపఁగనేల? నన్నిలువనీవా? సాయినాథప్రభూ! 24

సాయీ! నాయపరాధముల్ సయిచి నాస్వాంతంబుఁ జక్కంబడన్
జేయంజాలుదటంచు నెంచెదను; దుశ్చింతల్ దొలంగింపుమీ,
మాయంద్రోయకు, నీపదాబ్జముల సంభావింపఁగానిమ్మ, దే
వా! యీనీదుపరీక్షకున్ నిలువ నాకౌనే? దయాంభోనిధీ! 25

మిత్రద్రోహము నేన్ ఘటించుఁగల కూర్మిన్ బేర్మిఁగారించు, స
త్పాత్రాపాత్ర వివేకమున్ జెఱచు,దుర్వ్యామోహముఁన్ గూర్చుఁ,జా
రిత్రంబున్ మలినంబొనర్చుఁ, బెడదారిన్ద్రిప్పి నొవ్వించుఁ,గా
నేత్రం బెంతటి కల్మషేంద్రియమొ తండ్రీ! సాయినాథప్రభూ! 26

బాబా! నీదుదయామృతాంబునిధికిన్ బారంబులేదయ్య! నా
యీబాధల్ వెడఁబాపనేరికగు? నీవేచిక్క వేనెప్పుడో
యేబావో చెరువో యెదోకనక నేనిన్నాళ్ళు జీవింతునే?
నీబిడ్డల్ చెడరంచుఁ జాటుదను తండ్రీ! సాయినాథప్రభూ! 27

పరిపక్వస్థితి లేద యీమతికి, దుర్వాంఛాపరిగ్రస్తమై
యొఱుకన్ గాంచద, గ్రంథముల్ చదివెఁ గాకేమయ్యె నవ్వానిచే
తరుణీవిత్తచయాది సంసరణబంధ శ్రేణికిన్ జిక్కి వా
సరముల్ పుచ్చఁగనీక ప్రోవఁగదవే! సాయీ! ప్రపన్నావనా! 28

నినుఁదొలిపుట్టునన్ దఱియనేన్ గననేర్తునె నీదుపాదచిం
తనమును? నల్వదేండ్లుపయినన్ బడు నావల స్వప్న మందునే
పనికనిపింప, నీకృతులఁ బల్కుమటంచు వచింతువేమి? మి
త్రుని వెసఁబంపి నీపదరతున్ బొనరింతువయేమి ? సద్గురూ ! 29

ఏతపముల్ పొనర్చితినొ యేమొ యెఱుంగనుగాని తొల్లి, సం
జాతముగ గ్గొభక్తులగు సాధుకులంబునఁ దల్లిదండ్రులున్
దాతలు బంధుమిత్రులు నుదారములు బాల్యమునుండి భక్తియే
దొ తగఁజిత్తమందొదిగి యుండెను నీకృప, సాయి సద్గురూ! 30

నిను - విశ్వాత్ముని, విశ్వవందితునిఁ దండ్రీ! కానఁగాఁజాల భూ
త నికాయంబిది నీ కభిన్నమగు; సత్యంబీవ; విభ్రాంతి వా
సనలన్ గూర్పకుమయ్య!మ్రొక్కెదను;"శ్రీసాయీశరణ్"ధ్యాన మే
క్షణమందేన్ మఱువంగనీయకుమి; ఈశా ! సాయినాథప్రభూ ! 31

ఏకాలంబుననేని నేవిధిని నేయేమాత్ర భక్తాళికిన్
జేకూర్పందగు నీవెఱుంగుదువు; నిన్ జేపట్టు నాటన్ బలెన్,
నీకారుణ్యవిలాస మేమనుచు వర్ణింపంగనౌ! నద్భుతా
నేకంబుల్ ఘటియించి సాకుదువు,తండ్రీ! సాయినాథప్రభూ ! 32

తిండికిలేదు బాబ! యనఁదెత్తువు బియ్యము నెత్తిమోయుచున్
గొండొక పైసలేదనినఁ గొమ్మని యప్పయినన్ ఘటింతు, నా
యండను నిల్చి యార్తిని భయంబును బాపుదు; నీవె నాకు లే
కుండిన నేటికేమగుదునో గద? దిక్కఱి, సాయిసద్గురూ ! 33

బాబా! నీవొనరింపఁ బూనినపనిన్ భంగంబు వాటిల్లునే
కాఁబోదన్న విచారమేమియును నాకా లేదు; నన్నొమ్మఁగా
నేబాటన్ నడిపింతొ యట్లనడుతున్ హేయావమానంబులే
గా? బాగోగు లెఱుంగ నేనెవఁడ! దేవా! సాయినాథప్రభూ ! 34

బాబా! యంచన 'నో' యటందువఁట; "దేవా! ద్వారకామాయి సా
యీబాబా! కరుణింపవే" యనినఁ జేయిన్ జాచి నీభక్తు "రా
రా బాబూ!" యని చేరందీయుదట యార్తత్రాణ పారీణతన్;
నీబిడ్డన్ ననునోమ భారమగునె? తండ్రీ! సాయినాథప్రభూ! 35

'అల్లా'తోడ ప్రసంగమగ్నుఁ డగునో! యాత్మీయులే రేని వా
కిళ్ళన్ నిల్పిరో? యార్తుఁడౌ శ్రితునకున్ గేలీయ వేంచేసెనో?
యెల్లంబిల్చినఁ బల్కఁ, డీసయిన నాయీకూయి విన్పింపవే?
తల్లీ! ద్వారకమాయి! నీకు దయరాదా? సాయికై వచ్చితిన్. 36

ఐహిక దుఃఖగర్భిత సుఖానుభవంబులు సన్నగిల్లెఁ, నీ
దేహపటుత్వ సత్వముల తెన్నదితప్పె, ననుక్షణంబు సం
దేహముఁదోఁచె జీవముగతిన్ దిన మొక్కటి యేగ, నింక, దు
ర్మోహ మడంచి కర్మపరిపూర్ణము సేయవె, సాయిసద్గురూ! 37

కానన్ లేక, యనిత్యరూపమగు నీ కాంతాసుతాప్తార్థ భో
గానందంబుల నమ్మి, ప్రేమఁ బలుపంగాఁ జూచు నీవాని, సుం
తైనన్ లెక్కడు వారలుందురె? పరార్థప్రేమ యెందున్న ద
న్నా! నీయొక్కనియందుఁ దక్క, బుధమాన్యా! సాయినాథప్రభూ!

కోఁతిన్ బోలిన చేతమెల్లెడల లాగున్, నీతినీమంబులన్
ఖ్యాతిన్ జూడఁగనీదు, దుష్కృతులపై నాసక్తిఁ గల్పించు, నా
హా! తార్మారుగఁ జేయఁబ్రజ్ఞ, మలినంబౌ నిట్టిచిత్తభ్రమన్
బ్రాతిన్ బో నడపంగఁ జాలవొకొ? దేవా! సాయినాథప్రభూ! 39

ప్రీతిన్ నీదతిఁజేరు వారలను నీవే చక్కదిద్దన్ దగున్
లాతుల్ మాడ్కిఁ బరీక్ష సేయుటది యేలా? నీచసాంగత్య మీ
వే తూలించి, హరించవే యఘము; వేరేదారి కన్పింప, దే
స్వాతంత్ర్యం బది లేదు నీ శ్రితులకప్పా! సాయిబాబా! ప్రభూ! 40

తొలిజన్మంబున షిర్డియందు ద్విజజంతుస్థాణు పృథ్వీజగు
ల్మలతాకోటులం దొకండనయి ప్రేమన్ నీవో నీభక్తులో
వెలయన్ సత్పదరేణు సంగతిన నీ ప్రేమ నొందితిన్ నీపదం
బుల ప్రాపొందఁగ నోమునోచితిని, బాబూ! సాయినాథ ప్రభూ! 41

సాయీ! యన్నను, సాయినాథ యనినన్ సాయీశ్వరా! యన్న, శ్రీ
సాయీశంకర! సాయిదత్త! యనినన్ సాయీగురూ! యన్న శ్రీ
సాయీరాఘవ! సాయికృష్ణ! షిరిడీశా! యంచనన్, ద్వారకా
మాయామందిర సాయిబాబ! యనఁ బ్రేమన్ భక్తులన్ బ్రోవవే ? 42

అమ్మకచెల్లి! నీదగు దయారస మేమని చెప్పవచ్చుఁ? జి
త్తమ్మున నిద్దలంచెడి చిత్రప్రకరంబుల కెప్పుడెట్లు నా
యమ్మొనరింపఁగా నగునొ యవ్విధిఁ జేతు విచిత్రరీతి, ని
న్నమ్మిన వారలెన్నటికి నాశమెఱుంగరు, సాయిసద్గురూ! 43

‘యోగము’ ‘యోగము’ంచన ధనోన్నతిచే నది యోగమౌనె ? దు
ర్యోగము గాక; నీదు పదయుగ్మమునం దనయంబు భక్తి సం
యోగము నొంది చిత్తము మహోన్నతశాంతినిఁ గాంచు టొక్కటే
యోగము ‘రాజయోగ’ మన నొప్పుజనంబుల, సాయి సద్గురూ! 44

శాస్త్రీయంబగు కర్మలన్ జలుపఁగా సామర్థ్యమూ లేదికన్
నిస్త్రైగుణ్య పథంబునన్ మెలఁగ జ్ఞానిన్ గాను, సద్భక్తినేన్
శాస్త్రప్రోక్తముగా నొనర్చునన నేజాల్మండ; నీ నామస
న్నస్త్రాంశంబునఁ బాశముల్ దులుతుఁ దండ్రీ! సాయినాథప్రభూ! 45

సతియున్ బిడ్డలు పోయనీ, తుదకు నా సంబంధులున్ దూఱనీ,
మతికిన్ మత్సరమౌచు జీవితము వమ్మైపోవనీ, మిత్రసం
తతియున్ హేళనసేయనీ, విడువ సుంతన్ నీదు పాదాంబుజా
న్వితపానాసక్త చిత్తషట్పదతఁ, దండ్రీ! సాయినాథప్రభూ! 46

చెప్పఁగ నేమియో తలఁతుఁ జెప్పఁదొడంగిన మాటరాద; నే
నెవ్వఁడు నార్థికంపువ్యథలే వచియించుట నీవువింటయున్
దప్పనివయ్యె, నామతికి దారి మఱొండు కనంగరాద, యీ
ముప్పు నికెట్లుగాచెదవొ మ్రొక్కెద వేమరు, సాయి సద్గురూ! 47

తల్లినిఁ గొంగువట్టి తమదాఁపున కీడ్చుచు వెక్కియేడ్చు నా
పిల్లల కాటవస్తు లెవో పెట్టుచుఁ గన్మొఱగించు పోల్కి, నీ
కాళ్ళను బట్టి నా వివిధకష్టములన్ వెలిఁ బుచ్చుచున్న నా
కళ్ళనెటో భ్రమించి, యెఱుకన్ మఱపింతువె? సాయిసద్గురూ! 48

నీ నిందన్ బొనరించు నాస్తికులతో స్నేహంబు మాన్పింపవే
నీ నామంబును బ్రీతిమై నెపుడు ధ్యానింపన్ మతిన్ గూర్పవే
నానా భూతములన్ ద్వదాకృతినిఁ గానన్ జేయవే నీదు సే
వానిష్ఠన్ ఘటియింపఁ గాఁగదవె! బాబా! సాయి! షిర్డీశ్వరా! 49

ఏ నేకార్యముఁ జేయుచుండినను గానీ నీదు నామామృతం
బానంగాఁగల భాగ్య మీయఁగదవే! యాగామ ప్రారబ్ధముల్
నానా సంచిత కర్మలన్ దులుతు దానన్ జేసి, త్వద్విస్మృతిన్
గ్లానిన్ఁ గూర్పవె, యార్తభక్తజనపాలా! సాయినాథప్రభూ! 50

నీ మాయాపరికల్పితం బిదియ తండ్రీ! కామినీ విత్త దు
ర్వ్యామోహంబునఁ జిక్కిస్రుక్కితిఁ గృపాపారీణ చిత్తంబునన్
క్షేమంబైన పథంబుఁ జూపి, కడుగాసిన్ జెందు నన్నోమవే
చేమోడ్పుల్ ఘటియింతు, శాంతినిడవే! షిర్డీశ! సాయిప్రభూ! 51

నిత్యముఁ నేధనార్థినయి నిన్ భజియించుట నాకె సిగ్గగున్
సత్యముఁ బల్కుచుంటి, శ్రితసంచయకల్పకుజంబ వీవు నిన్
బ్రత్యహమున్ ముముక్షునయి ప్రార్థన సేసెడి భాగ్యమిమ్ము, నీ
యత్యనుకంప నెందఱకు నాశ్రయ మీయవు? సాయిసద్గురూ! 52

నీ దిక్కున్ గననోచఁబోవని మహానిర్భాగ్యులౌవారి కే
యేదిక్కున్నఁ బ్రయోజనంబు గలదే యిందేనినం దేనియున్ ?
నీ దిక్కే నెఱనమ్మితిన్ బెఱ నేదేనిన్ గోర నెందేనియున్,
నా దిక్కై యవలంబనం బిడవె! యన్నా! సాయిబాబా! ప్రభూ! 53

నీ పదకంజపంజర వినిర్మల దివ్యమరంద పాన సం
ప్రాపిత శాంతిఁగూర్చి మతిబంభరమున్ శయనింప నీయకే
రూపును మాపుఁ గాపురపు రొంపిని దింపి కలంప నేటికో ?
కోపపు పంకమందిటుఁ దగుల్పఁగ నేటికి ? సాయిసత్ప్రభూ ! 54

నా బుద్ధిన్ వసియించి యెట్లు చనుమన్నన్ మారు మాటాడకే
యాబాటన్ జనువాఁడ నాదగు శరణ్యంబీవ! ముమ్మాటికిన్,
నా బాగోగులకీవ; నాకిక స్వతంత్రంబంచు నొండున్నదే ?
బాబా! ద్వారకామాయి మందిర! శ్రితాపత్త్రాణ! సాయీశ్వరా! 55

ఋణముల్ కష్టము లేమి లేనియెడ నా కీనీదు పాదాబ్జ పా
వనసేవామహనీయభాగ్య మది సంప్రాప్తించునే ? యేదో కా
రణమున్ గూరిచి నీదుసన్నిధికిఁ జేరన్ జేతు నీవాని, న
ట్లని వ్రాక్రువ్వవె నీవ, యాత్రజనకల్పా ! సాయినాథప్రభూ ! 56

ధనధాన్యంబుల భోగభాగ్యముల నేదారిన్ బ్రసాదించినన్,
నిను, నీనామము, నీపదార్చనము, నీనిష్ఠాప్తి, నీసూక్తు లే
క్షణమందున్ మఱపింపఁ జేయకుమ, యీజన్మంబునఁ దింక నే
జననంబందు; శ్రితావనామరమహీజా! సాయినాథప్రభూ ! 57

"సత్యంబైన పథంబు వీడక చరింపన్ నేర్చి, వాగ్దత్తముల్
ప్రత్యంశంబును దీర్చుచున్, సహనవిశ్వాసంబులన్ గాంచుచో,
సత్యంతాదృతి నోముచున్ విడక నీయందుండి చేయూత నే
నిత్యంబిత్తును నమ్ము" మంచనవె ? తండ్రీ! సాయినాథప్రభూ ! 58

"ఏ భీతిన్ గననేల నేయెడల? నేనెవ్వేళఁ బ్రాపుండఁగా,
నీ భారంబుల నిల్పునాపయిని నేనేనిర్వహింతున్ సదా;
యీ భూతావళి నెగ్గొనర్ప గల దేదేన్ లేదు విశ్వంబునన్
నాభక్తుండగు వాని" కంచనవె? మాన్యా! సాయినాథప్రభూ! 59

గురుఁ డెంచేనియు "రమ్ము నాదఱికి నాకున్ మ్రొక్కు, మీదక్షిణల్,
పరిచర్యల్, సమకూర్చుమీ" యనుచుఁ బిల్వన్ బోఁడు;శిష్యుండాగిన్
పరమస్థానముఁ గోరి భక్తిదృఢవిశ్వాసంబులన్, దాన, స
ద్గురునింజేరి భజించు" నంచనవె ? బంధూ ! సాయినాథప్రభూ ! 60

ఏ సంస్థానముమీది ? షిరిడిసఖా ! యెవ్వారలో మీప్రభుల్ ?
శ్రీ సాయీప్రభువుల్ ; వదాన్యుల? హితశ్రీదాత, లేమిత్తురో ?
వాసోగ్రాసములన్ సతీసుత నిజాప్తశ్రేణికై యిత్తు; రే
మాసౌజన్య ? మదెల్ల - స్వానుభవవేద్యంబాద్యమున్హృద్యమా. 61

"కలహంబాడకు మేరితోనయిన ధిక్కారం బహంకారపుం
బలుకుల్ పల్కకు, మీ సుబోధఁ గమనింపన్ జాలవేన్, లోన నా
కులపాటున్ విసుగున్ వహింతు, నది నీకున్ మేలుగా" దంచు మున్
బలుకన్ లేదె ? శ్రితావనాభ్యుదయ ! బాబా!సాయిప్రేమాలయా! 62

"సతమున్ సాధులఁజేరి వందనసమర్చా సేవలన్ సల్పి జీ
వితమున్ నైతిక నిష్ఠమెఁ గడపెదేన్ విశ్వంబునన్ శుద్ధతన్
మృతివేళన్ గను, దీ వకాముకుఁడవై యిష్టేశులోనిల్పి పం
చతఁగాంచంగ విముక్తియా" ననవె ?యీశా !సాయినాథప్రభూ!63

ఐహిక భోగలంపటులునై ధనధాన్య సతీసుతాప్త సం
దోహము సేకరింపఁగ జనుల్ నిరంతంబును గాంక్షసేయు న
ట్లీహ, భవత్పదంబుల వహింపఁగ జేయుము ; కర్మబంధ దు
ర్మోహ లతాలవిత్ర ! గురుపుంగవ ! సాయి ! భవాంబుధి ప్లవా ! 64

పెట్టినమాత్ర గాక యొకపీసమునే నధికంబురా దిటుల్
గట్టిగ శాస్త్రముల్ వలుకుఁ గాదనఁబోవఁడు గాని యాశ్రయం
బెట్టుల వ్యర్థమయ్యెడిని? హీనునివేడి గడించుకంటె నీ
యట్టిడిఁగోరి రిక్తకరుఁడై చన మేల్గద? సాయిసత్ప్రభూ! 65

తగదంచున్ దగకేమి యంచనెడు ద్వైధాభావముల్ పోరి కా
ర్యగతిన్ దోఁపఁగనీయకే కలచి ధైర్యంబెల్లఁ బోకార్చు, మే
లగుదానిన్ గాని కీడుఁ దోఁచియగల నేర్పా లేదు, నీవీడ్చునా
పగిదిన్ బోవలె, నస్వతంత్రుఁడను, దేవా! సాయినాథప్రభూ! 66

కలుముల్ గూర్పఁదలంతువే నొరలునిన్ గాదందురా? లేకలే
ములఁ గుందింతువయేని, నెవ్వరయినన్ బోఁద్రోయువారున్నె? నిన్
బలుమార్గంబుల వేడివేడి, తుదకున్ బ్రాణాలపై నాసలున్
దలఁగన్ బెట్టఁగనుంటి, నేమను దనంతా! సాయినాథా! ప్రభూ! 67

అకటా! నీపదమందు నొక్కతఱి, నాయీ నీచకర్మంబులం
దోకటన్ జిత్తము సంచరించెడి నిదేమో? పాపినై నీదుచెం
తకు రాఁజంకెడు వీఁడు, వీనికిఁకఁ జిత్తస్థైర్యమున్ గూర్చి, ది
వ్యకరాలంబన మీయఁగాఁగదవె, దేవా! సాయినాథ ప్రభూ! 68

నీసంకల్పము లేకయే పొసఁగనౌనే మంచియేన్ జెట్టయే
నాసల్ పూనుట వ్యర్థమా; నెటులనైనన్ వీని నీడ్వంగదో
యీ! సర్వంబును నీవకాఁదలఁచి, వేరేచింతలన్ బాసి; నీ
డా సేవన్ దినముల్ గ్రసింప నిడుమయ్యా! సాయినాథప్రభూ! 69

తుచ్ఛములన్ సుఖంబులని తోషమునన్ బరువెత్తి చిత్తమా
పచ్ఛల బాధితంబయి దివానిశముల్ దపియించె, వీని జీ
వచ్ఛవ మట్లుఁజేసి తలవంపులు గూరిచె, నింతనేని నీ
స్వచ్ఛ పదాంబుజాశ్రయ ప్రశాంతి నిడంగదె! సాయిసద్గురూ! 70

కొండలనుండి డెందము, నగోచరమై చనెనుండు మార్గ, మె
త్తం దలనిల్వఁబోవదు, పదంబులు తొట్రిలు, కేలుకంపమున్
గొందెడి, బుద్ధిమాంద్యమగుఁ, బుట్టువు రోయుచు నున్నవాఁడ, నిం
కెందనుకన్ బరీక్ష కిటు లేనిలువన్వలె? సాయిసద్గురూ? 71

మానమె పోయెనేనిఁ గొఱమాలినదేగద వీనిపుట్టు వీ
ప్రాణము నిల్వనేమి? చనఁబాఱిన నేమి? తలెత్త వచ్చునే?
వేనకువేలు నీశ్రితుల వీడక ప్రోవవె? వీనినింకఁ గా
బూని నిలంబడన్ సలుపనోడుదె? వీడుదె? సాయిసద్గురూ! 72

ప్పటికేమి కావలెనో యీవెటులో సమకూర్చుచుందు, వీ
తిప్పలు గూర్పనేల? యెదొ తెన్ను ఘటించి విపచ్చయాంబుధిన్
దెప్పవయై, దఱిన్ గడపి తేర్పవ? యీతలవంపు జీవితం
బెప్పుడొ దుస్సహాంబయె, నిఁకేటికి నిల్వఁగ? సాయిసద్గురూ! 73

లోటున్ గలిగింపనీక యెపుడీవే? చోద్యమా పెక్కు చం
గాలన్ నీ చరణాంబుజాశ్రితులు యండన్నిల్చి రక్షింతు; వీ
కే లేకుండిన నిట్టినీచునకు వేరే నిల్వఁజోటున్నదే?
లీలాచాతుర్య మేరుసుదుఁ! దండ్రీ! సాయినాథప్రభూ! 74

స్వామీ! నన్బడదారి కీడ్చెదవు, నా ప్రారబ్ధమా? కాదయేన్
భేనుం బెంచుక లేద నాపయిని? గర్వించున్ ఖలుండంచు నా
గాముల్ వాపు తలంపు లోఁగనవ? నీవాఁడన్ నినున్ జేరితిన్
గా మేలేదొ విధింపుమీవ, గురుమాన్యా! సాయినాథప్రభూ! 75

శరణంచున్ ననుఁ జేరెనేనిఁ గలుషాచారుండె యౌఁగాక, స
త్వరమే రక్షనొసంగు" దంచు వచియింపన్బోవె! యీజీవి కు
త్సర హైన్యస్థితిఁ బాపి, నిత్యపరితృప్తస్వాంతుఁ గావించి, నీ
రమస్థానముఁ జేర్చుభారము వహింపన్ రావె! సాయీశ్వరా! 76

ఎవ్వరితోడఁ జెప్పుకొన ? నెవ్వరు నాదగు బాధఁదీర్చు వా
రెవ్వరి నాశ్రయింపఁ గరుణింతురు? ప్రాణము దుల్లసున్నచో
నొవ్వను; మానహాని కెటు నొవ్వకయుండఁగవచ్చు ? నింక నన్
నవ్వులపాలు సేయక కనంగదె! సత్కృప, సాయిసత్ప్రభూ ! 77

అకటా ! విద్యలనేర్వ నేమిట? వృథాయాసంబ, గొంతెమ్మకో
రికలన్ గోరితి, నవ్వుపాలయితి, దారిద్ర్యాంగనా ప్రేమ పా
త్రతఁ బో నాలక్ష్మివరించునెట్లు? పరనిందన్ సార్థకంబేమి! షా
మ్మిక నేమైనను గొంగువట్టితిని సామీ! సాయినాథప్రభూ ! 78

వారిన్ వీరినిఁ దూలనాడఁ దగవా? భాగ్యంబు రానున్న నె
వ్వారే నడ్డఁగలారె? కర్మములఁ ద్రోవన్ శక్యమే యెరికేన్ ?
ప్రారబ్ధం బనుభావ్య మానుగద! యేడ్వన్ దప్పునే? యెట్టులే
దారిన్ ద్రిప్పెదొ యట్టులేగెద, మహాత్మా! సాయినాథప్రభూ! 79

తొలిజన్మంబున నీయనుగ్రహ మదేదో రీతి నార్జింపనేన్
గలదే నీపదకంజభక్తిఁ గనుభాగ్యం బీభవంబందు, మున్
గల, నజ్జేరఁగఁ బిల్వగాఁగలవె? నీకబ్బాలు వల్కింతువే ?
నిలువంబెట్టుదెయింత కాలమును? దంట్రీ! సాయినాథప్రభూ! 80

"గురుడీతండు సమర్థుఁ డాశ్రయ మొసంగున్ బొమ్ము పొ" మ్మంచు నె
నెవ్వరుఁ బోఁద్రోయరు; పూర్వపుణ్య పరిపక్వంబైన సద్భక్తినె
త్తఁటినేనిన్ భవతాప తప్తుఁడె, ప్రశాంత క్షేమసౌలభ్యసు
స్థిర సౌఖ్యప్రద దక్షునిన్, దఱియఁగాదే? సాయినాథప్రభూ! 81

ఇదినిత్యంబ, యనిత్యమియ్యదియ; మేలీచొప్పు కీడిద్ది; సౌ
ఖ్యదమిద్దొ నిదికష్టదంబని, యెఱుంగంగాఁ బ్రమాణాంతరం
బెదియో కోరఁగ నేల? చిత్తమెట హాయింజెంది శాంతించు న
య్యదియే సంశ్రయణీయమౌ పదముగాదా? సాయినాథప్రభూ 82

చెడెదేహంబు మనంబునుంజెడె జెడెన్ శ్రీసంపదల్ తొంటి వం
గడపుం గౌరవమూ చెడెన్. జెడెను ప్రజ్ఞాలబ్ధి, వేయేల మున్
జెడుగున్ జేరుట; నీదు ప్రాపిపుడు తేర్చెన్; సర్వమల్లాట, నన్
జెడమార్గంబునఁ బోవనీయకు దయాబ్ధి! సాయినాథప్రభూ! 89

నినునాయేడుగడంచునమ్మితిని హానిన్ శాపి మేల్గూర్చి, మె
ల్పునఁ గాపాడితి ద్వాదశాబ్దములుఁ బ్రాపున్ గాపునై, నేటి నా
మనవిన్ దీర్పవ? చూడవా యిటు? ద్రవింపంబోవదా యేమి నీ
మనసొక్కింత? శ్రితార్తభక్తజన తామందార! సాయీశ్వరా! 90

పుడమిన్ దీనులకెల్ల నేఁడుగడవై పోషించు నిన్జేరు న
ప్పుడు నీయంతటి వానిఁజేతుగద! నీవో భక్తసంరక్షణం
బిడ నీబంటుని బంటువాఁడు, వటుఁగాఁడేన్ భిక్షువై యిట్లు శ్రీ
రిడినిన్ దోఁపఁగ నేమిహేతువిఁక? తండ్రీ! సాయినాథప్రభూ! 91

నాదైవంబును నాదుశాస్త్రము ప్రమాణం, బింక నన్యంబెదేన్
గాదం చుద్ధతిమై స్వపక్ష పరపక్షభ్రాంత చిత్తంబులన్
భేదాధ్వంబున పోల్చి సుక్కఁగ నిటన్ వేరున్నదే? యిట్టి దు
దుర్వాదశ్రేణికిఁ బాలుసేయకుము బాబా! సాయినాథప్రభూ! 92

ధృతియొక్కింతయు లేదు; విశ్వమున నట్లెట్లీడ్చు నీ శత్రు సం
తతినిన్ దారొఁన శక్తిలేదు; నిను నా దైవంబుగా విశ్వసిం
చితి, సుక్షేమ పథంబునన్ మెలపి, నీ శ్రీపాద పద్మాంతర
స్థితి జేకూర్పవె! నీ పదాశ్రితునకున్; శ్రీసాయినాథ ప్రభూ! 93

గృహబాధల్ ఋణబాధ లార్థికపు దారిద్ర్యంపుబాధల్ సుదు
స్సహమై వేచెడి, ధైర్యమూడి, నినునాస్వాంతంబునన్ నమ్మియా
గ్రహులతో నిందలమర్త్య నిల్చుటకు సంకల్పించితిన్, నీయను
గ్రహ మేనాటికిఁ బొల్చు వీనిపయి, రంగా! సాయినాథప్రభూ! 94

అనుపమ పూర్వపుణ్య సుకృతాతిశయాప్తము నీదుప్రాపు; నే
మని వచియించువాఁడ ? గలవా పదముల్ విశదీకరింప ? నా
క్షనిమునమేని నేమఱకఁ గాతువు గాదె? భవత్ప్రసాద జీ
వనులకు గల్గునే పరిభవంబు భయంబును! సాయిసత్ప్రభూ ? 95

ఈబామందునఁ దొంటిపుట్టువుల నేయే పాపకర్మాళి, సా
దాబుద్ధిన్ విడనాడి చేయనెటు ? నాయా పాపకర్మానుభూ
తే బాధించెడు వేవిధంబులుగ, నీవే చిత్తశాంతిన్ గృపన్
నీబిడ్డల్ చెడకంచు నమ్మితినిఁ దండ్రీ! సాయినాధప్రభూ ! 96

అనుపంబై పొనుపొందు కష్టముల దైన్యంబెందు రేకెత్త "నె
వ్వనిఁజేరందగు? నేనివేడనగు? నాప్రాపెవ్వఁడా ? యే తెఱం
గున నెచ్చోటులనుండి సాయముదినాకున్‌గల్గునా" యంచుఁగుం
దును మీఁదున్ గనుచుంటి, నిన్‌గనక,బంధూ! సాయినాధప్రభూ! 97

'చందావర్కరు' భక్తిమైఁబొనరుపన్ సంవాహన ప్రక్రియల్
సందేహంబులు వాపుచుంటివ? 'మహాల్సా శ్యాములం' జేర్చిచెం
తం దీర్ఘంబుగ ముచ్చటరాడెదవ? 'రాధాబాయి' వేణీల త్రే
న్పందుంటే? యెటు? దీనునన్ మఱచినావా? సాయినాధప్ర ! 98

హృదిమాలిన్యముఁ ద్రోయనేరక జనుం డేరీతి నిన్జేరు? నీ
పదసాన్నిధ్యముఁ జేరఁడేనెటులఁ ద్రోవంజాలుహృత్కల్మషం?
బదియే చెల్లు "నదృష్ట" మన్ననుడి; నీ యవ్యాజవాత్సల్య వ
ర్షదపాంగేక్షణ పక్షపాతమ "యదృష్టప్రాప్తి" సాయీశ్వరా! 99

మాన్యంబైన పదంబుపీడి, చెడి. దుర్మార్గంబులన్ ద్రొక్కి సౌ
జన్యంబేది, తపించి స్రుక్కనను నీ సాన్నిధ్యమున్ జేర్చి తీ
హైన్యంబున్ దొలఁగింపఁజాలవెటు? నీయాస్థానమం దెవ్వఁడేన్
దైన్యంబొందిన నీకులాఘవము గాదా? సాయినాధప్రభూ! 100

లోకంబందు ఋణానుబంధమునఁ గల్గున్ బ్రాణిసం యోగముల్
కాకేన్ గుక్కయు నేనిఁ బిల్లియయినన్ గాసీ మరేజీవియేన్
సాకల్యంబు ఋణంబుఁదీర్చికొనఁ బంచన్ జేరు, చీకొట్టఁగా
నీకున్ బోల దటంచుఁ దెల్పితివి, తండ్రీ! సాయినాథ ప్రభూ! 101

తెలివిన్ దప్పనె యెప్పుడేనియు మహాధివ్యాధు లేపంగఁ, జం
చలతన్ గాంచునె కల్మి లేములకునై; స్వర్గాపవర్గంబులన్
దలఁపన్ బోవునె? జంకునే మృతికి; వ్యర్థంబస్థిరంబైన కో
ర్కెలకుంజిక్కునెఁ త్వత్పదాంకితుఁడు! తండ్రీ సాయినాథ ప్రభూ!

తనివిన్ గూర్పనిసంపదల్, హృదయమున్ దార్మ్యఱుఁగా వించు భో
గనికాయంబులు, నంతమెయ్యెడ నెఱుంగన్ రాని యీవిద్యలున్,
వెనుకన్ ముందును గాననీని పదవుల్, వేభంగులౌ కర్మలున్,
నినుఁ జేర్పంగ సమర్థనీయములె? తండ్రీ! సాయినాథ ప్రభూ! 103

ఏయయ్యల్ ముదమారఁగా నిడిరొ నీకీపేరు! సుశ్రేయమై
ధ్యేయంబై, సకలార్థదంబయి, రసాధిష్ఠానమై, శ్రావ్యమై
హాయిఁ గూర్చుఁ దలంచినన్ వినిన నోరారం జపింపంగ, నీ
'సాయీ' ద్వ్యక్షర మెల్లజీవులకు విశ్వంబందు, శిర్డీశ్వరా! 104

హనుమధ్యానము, దత్తవందనము, కృష్ణాసక్తి, శ్రీరామచిం
తన, మృత్యుంజయమానసాభినుతి హత్తంజేసి యొక్కొక్కచో
ప్పున మున్నిన్ని యిఁకెన్నొ! యన్నియగు రూపుల్ దాల్చునాదివ్యభా
గ్యనిధానంబయి నేడువచ్చితి గదయ్యా! దేవ! సాయీశ్వరా! 105

నిదురన్ బొందెడి నన్ను మేల్కొలిపి నీ నిర్హేతుక ప్రేమ కా
స్పదునిన్ జేసి సముద్ధరించితివి, యీసంబంధ మేనాటిదో
గద? న న్నత్యనుకంప నిందనుక సాఁకన్ జాలు నిన్గూర్చి నా
యెద సేవించుటయెట్లొ నేనెఱుఁగ సాయీ! భక్తచింతామణీ! 106

బాబా! 'సాయి' పదంబునీకతగు నన్వర్థాభిధానంబునై
ప్రాబల్యంబును గాంచు నెల్లెడ సమర్థంబౌచు, సందేహమే
లా ? బీజాక్షర సంపుటీకరణ మాహాత్మ్యం బగమ్యంబు; స
త్తాబాహుళ్య మచింత్యమై పఱగు, నంతర్యామి! శిర్డీశ్వరా ! 107

హితమున్ గూరుచు నీ బహూకృతులు - నీ యాగ్రహానుగ్రహ
ప్రతిపాద్యంబులెవేని నీ శ్రితులకున్ భద్రప్రదంబుల్; కృత
జ్ఞత విశ్వాస వినమ్రతల్ సహనమున్ గల్పించి, యీ నీ పదాం
తవృత్తిన్ ఘటియింపగాగదవె ! తండ్రీ ! సాయినాథప్రభూ ! 108

పరవృత్తంబుల నాలకించుటయు, సంభాషించుటల్ దూరుటల్
పరభాగ్యోన్నతి కీసు, దుస్సహన భావంబూనుటల్ వాపి, నీ
చరణాబ్జంబులయందు దృష్టినిడి, నీ జాడల్ విలోకించుచున్
చరియింపందగు బుద్ధిశక్తు లిడవే! సాయీశ! భక్తప్రియా! 109

అరిషడ్వర్గము నీ యధీనమగు మాయా కింకరుల్; వీరి నీ
శరణం బొందినవారిపై తరిమి శిక్షారూపమౌ ఘోర సం
సరణాంభోనిధి ముంచి తేల్చెదవ ? నా స్వాంతంబు నీ పాద పం
కరుహాంబందున హత్తజేసికొని చక్కన్ దిద్దు; సాయీప్రభూ ! 110

నిను విశ్వాస విహీనులై మఱచి, యెంతేన్ దూరదూరంబునన్
జను నీ బిడ్డల ప్రేమ జీరుదు; కటాక్షశ్రీల సారించి, ర
క్షణ గల్పింతువు; నీ పదాశ్రితుడ, జక్కన్ దిద్ది యీదీను ప్రా
ర్థన మాలింపవె! తేర్పవే! కృప; సమర్థా సాయినాథ ప్రభూ! 111

సకలంబందున నీవ పొల్చెదు; తలంచన్ చేతనాచేతనా
త్మక విశ్వంబునునీవ; వేఱయిన తత్త్వంబెందునున్ లేమి, వీ
నికి బింబ ప్రతిబింబ మాత్రమనుమీ "నీ-నా" స్వరూపస్వభా
వికదృష్టిన్ ఘటియింపగాగదె! కృపాబ్ధీ! సాయినాథప్రభూ! 112

జనముల్ కూరుచు మెప్పుదెప్పుల జలించన్ బోక, దేహాత్మ బు
ద్ధిని బోకారిచి, ప్రేమ మార్దవ దయాస్తిక్యార్త హృత్కంజ సీ
మను వెల్గొందెడి నిన్ను జేరి చిర-భూమానందమున్ గాంచు పా
త్రుని జేయంగదె! మ్రొక్కువాడ; శ్రితబంధూ! సాయినాథప్రభూ, 113

పరమ ప్రేమను, సర్వభూతహిత సేవాసక్తబుద్ధిన్, నిరం
తర నిర్నిద్రత, నీ పదాంబుజపరిధ్యానంబు హర్తించి, స
త్పురుషుల్ మెట్టిన జాడలన్ దెలిపి, పాపున్ గాపునై, నీనిచే
బరిచర్యల్ జరిపించుకోఁగదవె! దేవా! సాయినాథప్రభూ! 114

తలపుల్ పల్కులు చెయ్వు లేకసరణిన్ దైవార నీ కంకితం
బులు గానీయవె! నీదు కల్మికతనన్ భూతప్రపంచంబు వ
ర్తిలుచుంటన్ గను జ్ఞానదృష్టి నిడవే! దేవేశ! నీ కంటె వ
న్యులు ప్రాపెవ్వరు నాకు లేరు; శ్రితబంధూ! సాయినాథప్రభూ! 115

తనువే 'నే' నను బుద్ధిమై స్వపర భేద భ్రాంతి, జీవాళి యం
దనురాగంబును ద్వేషమున్ బఱపి సర్వాంతర్యామియౌ నిన్నొగిన్
గనలేకుంటిని, నీ పదాశ్రితుడ - "నీ-నా" లక్షితాధ్యాత్మ భా
వనిరూఢిన్ ఘటియించి ప్రోవగదె! దేవా! సాయినాథప్రభూ! 116

ఇది నా యిల్లివి నాదు భూము లివి నా యీ సొమ్ములౌనంచు నా
హృదియం దాసురశీలినై చెడితి, తండ్రీ! నన్ను, నా వాని, నీ
పదకంజాంకితముల్ పొనర్చుకొని, తృప్తస్వాంతునై నీదు ది
వ్య దయాపాత్రుని జేసి దిద్దగదె! బాబా! సాయినాథ ప్రభూ! 117

పరవిద్వేష పరాపవాద కథన వ్యాపారమున్ బాపి, యీ
శ్వరసృష్టంబగు జీవకోటియెడ సద్భావంబు హర్తించి, నీ
పరరూపంబగు ప్రాణిసంతతికి సేవల్ సేయు బుద్ధిన్ నిరం
తరమున్ గూర్పవె! నీకు మ్రొక్కెద; మహాత్మా! సాయినాథప్రభూ

అనురాగంబున 'రండు ! రం'డనుచు నాహ్వానించు ప్రేమస్వరూ
పుని నిన్ జేరగజాలు యోగ్యతను - సద్బుద్ధిన్ ప్రసాదించి, పీ
నిని నీవే దరిచేర నీడ్చికొని, శాంతిన్ గూర్చి, ప్రేమామృతం
బున దన్పంగదే! నీకు మ్రొక్కెదను; బాబా! సాయీనాథప్రభూ!

ధనమా! నిన్నుననున్నుఁ గూర్పఁగల బంధం బేభవంబందు ? నేఁ
గనఁగా లేక ధనార్థినై నినుఁగడున్ గారించి వేధించితిన్,
నినుఁగా కన్యముఁగోర; నేడుగడవై నీవుండ, నీభోగభా
గ్యనిధానంబుల నేమిసార్థకము ! రంగా ! సాయి శిర్డీశ్వరా! 120

దోసెండన్నము పేదకీయఁ గలయందున్ మెచ్చి, రూపాయలన్
దోసెండిచ్చితి వాదినంబునన; సాదుల్ పేదలౌ దీనులం
దాసక్తిన్ గని యేలవంబడిన నాహా! యేమి నీమోద! మీ
స్త్రీసందేశ మెఱుంగఁ జేసితివి, తండ్రీ! సాయి! క్షిప్రప్రదా ! 121

నీకున్ బ్రేమ సమానమీజగతిఁ బ్రాణిశ్రేణిపై నేరి కే
యేకాలంబున నెట్టు లేగతిని నేయేమాత్ర మీఁజెల్లునో
నీకే వేద్యము, నీరహస్యమును గంటిన్; నిన్నుఁ గాదంచు నే
రూకేనిన్ గదలంగనోడును గదయ్యా! సాయిబాబా! ప్రభూ! 122

తగ రూపంబిడి నిన్నరూపకుని నేధ్యానించు చున్నాఁడఁ నెం
చగ వాగ్బుద్ధుల మించునిన్నుఁ బ్రవచించన్ జాతునేమేమొ, స
ర్వగతున్ నిన్ గనకేపొనర్చెదను తీర్థక్షేత్రయాత్రల్, క్షమిం
చఁగదే త్రివిధాప రాధముల నీశా! సాయినాథప్రభూ! 123

అరుదా నీకృప పీసిపైఁ బఱపి నీయాస్థాన మందొక్క కిం
కరుఁగాఁ గొంటివి, నీకృతుల్ పలుక నాజ్ఞాపించి తీనీ ద్వయీ
స్మరణంబే భవవార్థి సంతరణమన్ సత్యం బెదన్ నిల్పు మే
మరనీకయ్యా! నమస్కృతుల్, కృతినిఁగొమ్మా, సాయినాథప్రభూ !

శ్రీసాయీ స్మరణ సమాప్తము

# శ్రీ సా యీ పూ జ

శ్రీ సిద్ధి విఘ్నేశ ! సేవింతువయ్యా !
దోసముల్ దులిచి సంతుష్టి నిమ్మయ్యా !
శ్రీసాయి పదభక్తిఁ జేకూర్పుమయ్యా !
వాసిగ విఘ్నముల్ వారింపుమయ్యా ! 1

జయము సాయీనాథ ! సాయీశ ! జయము
జయము ద్వారకమాయి సద్వాస ! జయము.
జయము సంశ్రితభక్త జనపోష ! జయము
జయము శిర్డీనివాసా ! ప్రభూ ! జయము. 2

రారమ్ము, శిరిడి రాజ ! సాయీశ !
ద్వారకా మాయి సద్భవన నివాస !
భక్త జనపోష కల్పద్రుమా ! రమ్ము,
ముక్తిదాయక ! సాధు బుద్ధి నాకిమ్ము. 3

శ్రీరామ సాయిఁ బ్రసిద్ధ ప్రభావుఁ,
గారుణ్య రసపరి కలిత స్వభావు,
నిను, బరమాత్మ, హృన్నీ రేజ మందు
ననవరతము నిల్పి, ధ్యానించు చుందు. 4

నీవు వసింతు వీనిఖిలంబు నందు,
జీవ చయంబు వసించు నీయందు;
వాసు దేవుండనఁ బఱగుచునుందు,
శ్రీసాయి ! నిలుము నాహృత్పీఠ మందు 5

హృదయ పద్మస్థమై యెనలేని మణులఁ
గదిరిన బంగారు గద్దెపై మిగులఁ
గూరుచో శ్రీసాయి ! కోరి నీశ్రితులు
చేరిసల్పగ నమస్కృతులు వేగతులు. 6

బంగారు చెంబులోఁ బదిలమై యున్న
గంగతోఁ బాదముల్ గడుగ నిమ్మన్న !
పరమ పావన సాయి పాదాంబువులను
శిరమునఁ దాల్చి నిశ్చింత నుండెదను. 7

ఆర్తులౌ జనముల యార్తినిఁ బాపు
కీర్తినిఁ గన్న నీకేలు నాప్రాఁపు !
ఆకాశ గంగ తోయముల నర్ఘ్యంబు
నీకిత్తు సాయి ! మన్నింపు నిత్యంబు. 8

వేద శాస్త్ర స్మృతుల్ వెలయించినావు
వేదాంత వీథుల విహరింతు వీవు;
ఆచమ నోదకం బర్పింతు నీకు
వాచంయ మీశ ! బాబా ! సాయి ! సాకు. 9

కడుఁ దీపి పెరుగుఁ జొక్కపుఁ దేనియలును
గుడముఁ గమ్మని నేయి గోక్షీరములను
అనువగు మధుపర్క మర్పింతుఁ గొనుము;
అనిశము సాయి నాథా ! నన్ను మనుము. 10

సంచి తాగామాది సకల కర్మముల
నంచిత గతినాశ మందించి, శ్రితుల
సంచ యములనేలు సాయి ! కైకొమ్ము
పంచా మృతంబులఁ బఱగు తానమ్ము. 11

ముల్లోకములఁ బేరు మొనసి పూతములు
నెల్ల తీర్థంబుల నెసఁగు తోయములఁ
జెలువొందఁ దెచ్చితి, శ్రీసాయి ! రమ్ము
సలుపుము స్నానమ్ము, శ్రమనుబోఁ జిమ్ము. 12

తడియొత్త నిమ్ము మోదమున నీవానిఁ,
దొడుగుము వనసముల్ దువ్వల్వ కుపిని,
తలకప్పు ధరియింపు ద్వారకామాయి
నిలయ ! దయామయ ! నిఖిలేశ ! సాయి ! 13

దండ ధరార్తి విదళన విఖ్యాత
దండంబు నర్పింతుఁ దాల్పుమి చేత,
శ్రిత పారిజాతమా శ్రీపాదయుగళి
హిత పాదుకలివె సాయీ ! సాధుమాళి ! 14

సుందర గౌరాంగ శుభ మయాకార !
చందనం బలదెద ! సమ్మోద మార;
నతి పవిత్రంబులౌ నక్షతల్ గొనుము
పతిత పావన ! సాయిబాబ ! ప్రాపగుము. 15

మంజుల జేయూర మణి హారములను,
వింజామరంబుల వెల్ల ఛత్రమును,
నవ విధరత్న కాంచన కిరీటమును,
నవదరింపగదయ్య ! సాయి ! యిమ్ముగను. 16

కప్పుర చూర్ణంబు కపిల గోఘృతము,
నొప్పగు సాంబ్రాణి యుతము, విస్తృతము.
నైన, ధూపంబి దేయర్పింతు దేవ !
జ్ఞాన గమ్యా ! సాయి ! కరుణాస్వభావ ! 17

వెలిని లోపల దమోవిసరం బడంచుఁ
బెలుచ మువ్వత్తుల వెలుగుచు మించు.
దీప మర్పించెద దేవ ! సాయీశ !
ఆపన్న భక్త జనార్తి ప్రణాశ ! 18

మల్లెల మొల్లల మంకెన పూల,
ఫుల్లారు గాంబు జంబులఁ బొన్నపూల,
పారిజాతముల సంపఁగి పుష్పములను,
మారేడు దళముల మందారములను. 19

సాయిఁ నిన్ బూజింతు ! జంద్ర కాంతముల
ధ్యేయ! నిన్నర్చింతుఁ దెల్లదామరల
తులసీ దళంబుల దొరను బూజింతుఁ
గలువ పువ్వులఁ గౌతుకమున బూజింతు. 20

సన్నజాజుల బాదజలజ మర్చింతు,
గన్నేరు పువ్వులఁ గరము నర్పింతు;
చెన్నుగ శ్రీసాయిఁ జెంగల్వ బంతి
పున్నాగ తంగేడు పూలఁబూజింతు. * 21

ద్వార కామాయి నివాస నిన్ గొలుతు
కారుణ్య రసమయాకార ! నిన్ దలఁతు,
భవరామకృష్ణ పాపని రూపునెంతు,
భవవిమోచను సాయి బాబున్ భజింతు 22

ఘుమఘుమఁ దావులఁ గ్రుమ్ము శాకములు
విమలాంబువులు రుచుల్ పెనుచు లేహ్యములు,
పలువిధాపూప సూపములు చోష్యములు,
సలలిత పాయస సద్యోఘృతములు. 23

పొంగారు రాజాన్నములు, తీపి పెరుగు
బంగారు పాత్రలఁ బదిలమై పఱగు,
పరిషేచనము సేసిభక్షింపు మోయి !
శరణాగతత్రాణ చరణ ! శ్రీసాయి 34

* అష్టోత్తరశత నామావళి చెప్పనగును

పనసతొనలు ద్రాక్షఫలము లిక్షువులు
పానుపగు ఖర్జూరములు రసాలములు
నారికేళంబులనంటు లింపార
నారగింపవె సాయి! ఆర్తమందార! 25

ఉత్తరా పోసనం బొయ్యనఁ గొమ్ము
దత్తరూపా! పరాత్పర! సాయి! యిమ్ము
కరములఁ బదములఁ గడుగఁగానిమ్ము
పారినొ నర్వంగదే ముఖమార్జనమ్ము 26

పూగముల్ కుంకుమపువ్వు కప్పురము
బాగు లేలకి జాజిపత్తిరి ఫలము,
తమల పాకులును ముత్యంపుఁ జూర్ణంబుఁ,
గొమరార సాయి! కైకొను తమ్ములంబు. 27

ద్వారకామాయి సౌధాంతర శాయి!
నీరాజనంబిదే నీకిత్తు సాయి!
కప్పురహారతిఁ గైకొమ్ము దేవ!
తప్పుల సైపుము దారప్రభావ! 28

మంగళం బిదెసాయి! మార్తాండ తేజ!
మంగళం బిదెసాధు మండల రాజ!
ద్వారకా మాయినివాస! మంగళము
కారుణ్యరస శుభాకార! మంగళము 29

కుందముల్ జాజులు కురవ కంబులను,
మందారములు బంతి మల్లెపూవులను,
పసనైన తులసి బిల్వ దళంబుల మరఁ
గుసుమాంజలిని సాయి! కొనుమోద మలర. 30

ఎల్ల మోహంబుల నెలమిఁ బోకార్చి,
యెల్ల శుభంబుల నింపారఁ గూర్చి
చెలఁగు సాయికిఁ బ్రదక్షిణము మాచరింతుఁ,
బలుమారుసాగిలఁబడి వినుతింతు. 31

వంద నంబిదె సాయి! భక్తమందార!
వందనం బార్తి నివారకోదార!
వందనంబు సమత్వ భావప్రచార,
వందనంబు సమర్థ పద చిద్విహార! 32

భవమహాంభోనిధిఁ బడి పాపకృతుల
వివిధముల్ పొనరించి వేసరి మిగుల।
బలు కోర్కెలకు। జిక్కి, పారమున్ దలఁపఁ
దెలియ, సాయీ! రమ్ము తెప్పవై కదియ. 33

నిన్నుఁ గాకన్యంబు నేనిచ్చగింప,
నెన్నియో నవినీకు నెనయే తలంప?
నీకృపామృత దృష్టినేఁ గోరువాఁడ
సాకల్య మదియు, శ్రీసాయి! నీ వాఁడ. 34

శిరిడి పుణ్యంపు క్షేత్రాంతరమున
ద్వారకామాయి సద్భవ నంబులోన
శరణన్న వారి రక్షణ దీక్ష నెక్కు
వరదయాంబుధి సాయిబాబు నాదిక్కు 35

వేంకుశ సద్గురు విభునకు జయము!
సంకట హరణుఁడౌ సాయికి జయము!
ద్వారకామాయి సుస్థలికిని జయము!
ధారుణి సాధువర్తనులకు జయము! 36

పూజసమాప్తము, శ్రీసాయీ సాధార్పణమస్తు.

ఓమ్

## శ్రీ సా యి బా బా

# అష్టోత్తర శతనామావళి

ఓమ్ శ్రీసాయీ నాథాయనమః
,, శ్రీలక్ష్మీ నారాయణ నమః
,, శ్రీకృష్ణ రామశివ మారుత్యాది రూపాయ నమః
,, శ్రీశేషశాయినే నమః
,, గోదావరీ తటషీర్డీ వాసినేనమః
,, భక్తహృదయాలయాయనమః
,, సర్వహృద్వాసి నేనమః
,, భూతావాసాయ నమః
,, భూత భవిష్యద్భావ వర్జితాయనమః
,, కాలా తీతాయ నమః 10
,, కాలాయ నమః
,, కాల కాలాయనమః
,, కాల దర్పదమ నాయనమః
,, మృత్యుంజయాయ నమః
,, అమర్త్యాయ నమః
,, మర్త్యాభయ ప్రదాయనమః
,, జీవా ధారాయ నమః
,, సర్వా ధారాయ నమః
,, భక్తావన సమర్థాయ నమః
,, భక్తావన ప్రతిజ్ఞాయ నమః 20
,, అన్నవస్త్ర దాయ నమః
,, ఆరోగ్య క్షేమదాయ నమః
,, ధన మాంగల్యదాయ నమః
,, వృద్ధి సిద్ధి దాయ నమః
,, పుత్రమిత్ర కళత్ర బంధుదాయ నమః
,, యోగక్షేమ వహాయ నమః
,, ఆపద్బాంధవాయ నమః

ఓమ్ మార్గ బంధవే నమః
,, భుక్తిముక్తిస్వర్గాపవర్గదాయ నమః
,, ప్రియాయ నమః 30
,, ప్రీతి వర్ధనాయ నమః
,, అంత ర్యామినే నమః
,, సచ్చిదాత్మనే నమః
,, ఆనందాయ నమః
,, పరమేశ్వరాయ నమః
,, పరబ్రహ్మణే నమః
,, పరమాత్మనే నమః
,, జ్ఞాన స్వరూపిణే నమః
,, జగతః పిత్రే నమః 40
,, భక్తానాం మాతృ దాతృ పితామహాయ నమః
,, భక్తాభయ ప్రదాయ నమః
,, భక్తవత్సలాయ నమః
,, భక్తానుగ్రహ కాతరాయ నమః
,, శరణాగత వత్సలాయ నమః
,, భక్తిశక్తి ప్రదాయ నమః
,, జ్ఞానవైరాగ్య దాయ నమః
,, ప్రేమ ప్రదాయ నమః
,, సంశయ దౌర్బల్య పాపకర్మ వాసనా క్షయకరాయ నమః
,, హృదయ గ్రంధి భేదకాయ నమః 50
,, కర్మ ధ్వంసినే నమః
,, శుద్ధ సత్వస్థితాయ నమః
,, గుణాతీత గుణాత్మనే నమః
,, అనంత కల్యాణ గుణాయ నమః

ఓమ్ అమిత పరాక్రమాయ నమః
,, జయినే నమః
,, దుర్ధర్షాక్షోభ్యాయ నమః
,, అపరాజితాయ నమః
,, త్రిలోకేష్వ స్కంధిత గతయే నమః
,, అశక్య రహితాయ నమః 60
,, సర్వశక్తి మూర్తయే నమః
,, సురూప సుందరాయ నమః
,, సులోచనాయ నమః
,, బహురూప విశ్వమూర్తయే నమః
,, అరూపావ్యక్తాయ నమః
,, అచింత్యాయ నమః
,, సర్వాంత ర్యామినే నమః
,, మనోవాగతీతాయ నమః
,, ప్రేమ మూర్తయే నమః
,, సులభ దుర్లభాయ నమః 70
,, అసహాయ సహాయాయ నమః
,, అనాధ నాధాయ నమః
,, దీనబాంధవే నమః
,, సర్వభార భృతేనమః
,, అకర్మానేకకర్మ సుకర్మణేనమః
,, పుణ్యశ్రవణ కీర్తనాయ నమః
,, తీర్థాయ నమః
,, వాసు దేవాయ నమః
,, సతాంగతయే నమః
,, సత్పరాయణాయ నమః 80
ఓమ్ లోకనాధాయ నమః
,, పావనానఘాయనమః

ఓమ్ అమృతాంశవే నమః
,, భాస్కర ప్రభాయ నమః
,, బ్రహ్మచర్య తపశ్చర్యాది సుకృతాయ నమః
,, సత్యధర్మ పరాయణాయ నమః
,, సిద్ధేశ్వరాయ నమః
,, సిద్ధ సంకల్పాయ నమః
,, యోగేశ్వ రాయ నమః
,, భగవతే నమః 90
,, భక్త వశ్యాయ నమః
,, సత్పురుషాయ నమః
,, పురుషోత్తమాయ నమః
,, సత్యతత్త్వ బోధకాయ నమః
,, కామాది సర్వాజ్ఞాన ధ్వంసినేనమః
,, అభేదానందానుభవదాయినేనమః
,, సమసర్వమత సమ్మతాయనమః
,, శ్రీదక్షిణా మూర్తయే నమః
,, శ్రీవేంకటేశ రమణాయ నమః
,, అద్భుతానంత చర్యాయ నమః 100
,, ప్రపన్నార్తి హరాయ నమః
,, సంసారసర్వదుఃఖక్షయాయ నమః
,, సర్వవిత్ సర్వతోముఖాయ నమః
,, సర్వాంతర్బహిస్థితాయ నమః
,, సర్వమంగళకరాయ నమః
,, సర్వాభీష్ట ప్రదాయ నమః
,, సమరససన్మార్గ స్థాపనాయ నమః
,, శ్రీసమర్థ సచ్చిదానంద సద్గురు శ్రీసాయి నాధాయ నమః

నామావళి సమాప్తము

# శ్రీ సాయి దండకము

జై! జై! ప్రభూ! సచ్చిదానంద మందస్మితోదార! జై! భక్తసందోహమందార! జై! వాసుదేవ ప్రశస్తావతారా! శ్రితత్రాత సంరక్షదక్షా! సదాభక్తపక్షా! నినున్ గోరి నీపాదపంకేరుహంబుల్ మదిన్నిల్పి, నీదివ్యనామామృతాస్వాదనాసక్తి నానాల్కకున్ గూర్చి, నిత్యంబు నీకీర్తిఁ గీర్తింపనీదండకం బొక్కటిన్ బల్క నూహించితిన్ దేవ! నా వాక్కునన్ నిల్చి భాషింపవే! శిరిడీవాస! శ్రీద్వారకామాయి! సన్మందిరాంతర్విరాజత్ప్రభాచిద్విలాసా! గురూత్తంస! శ్రీసాయి! సాయిప్రభూ! జమ్నబాయ్ నందలాల్ గర్భసచ్ఛుక్తిముక్తాఫలంబై భువింబుట్టువుంగాంచితీవంచు, నీజన్మవాసంబు ఘూర్జప్రదేశాంతరస్థంబు పత్రీమహాగ్రామమంచెన్నుచున్నారిలన్, సాధుజన్మంబుఁ గర్మంబు లెవ్వారికిన్ వేద్యమా? వేంకుశాభిఖ్యుఁడౌ గోపరావ్ దేశముఖ్ సత్కృపాపూర్ణ సంప్రాపితైశ్వర్యధుర్యుండవున్, దీనసంరక్షదక్షుండ నీవంచు సంకీర్తనల్ సేయరే నిన్ను? నీభక్తసంరక్షణార్థంబు చాన్ భాయ్ పటేల్ కారణంబూని, శిర్డికి వేంచేయవే? మున్ముసల్మానుచేఁ బెంపు గంటన్ ముసల్మాను రూపంబునన్ దోఁచు నిన్గాంచి హింద్వాజనంబాదరింపంగ రాకున్న, నీవామసీదందునన్ నిల్చియద్దానికిన్ ద్వారకామాయి నామంబుఁ గై సేయవే? వేనవేల్ భక్తులన్ బ్రోవవే? కారణంబొండు కల్పించి నీవారినీ పజ్జకున్ జేర్చవే? యొక్కమారెట్టివాఁడేని "శ్రీసాయిబాబా! ననున్ బ్రోవవే!" యన్న, నవ్వానిఁ జేపట్టి యోగంబు క్షేమంబు సర్వంబునున్ బూనవే? తండ్రీ! నీప్రేమవారాశికిన్ బారమున్ గల్గునే? జన్మలెన్నిట్లనైనన్ శ్రితుంజేరి మోక్షంబుఁ బ్రాప్తించునందాక రక్షింపవే? దేవ! నీపాదసంవాహనం బాచరింపంగ 'చందోర్కర్' రేపాటిపుణ్యంబు నార్జించెనో గాదె? నిత్యంబు భిక్షన్ సమర్పింప నాశ్యాముఁ డేనోముఁ గావించెనో? నాథ! నార్కేర్ 'నిమోన్కర్ల' భాగ్యంబదేపాటిదో? 'రాధికా

ణ్ణిఆయీ' సదానీదు సేవాప్రసాదంబు లార్జింప నేపుణ్యముల్
సినయయ్యా! 'గణూదాస్ మహారాజు' నీకీర్తనన్ బ్రొద్దుపుచ్చం
దే? 'తారబాయ్ చంద్రబాయీల' రక్షింపవే? వారు పిరంచుఁ
గా నేమాను? నీప్రాపునన్ వేనవేల్ భక్తు లానందమున్ బొంద
దే? గురూ! చీమగా, కాకిగా, పిల్లిగా, కుక్కగా జోగిగా పెక్కు
రూపంబులన్ భక్తులన్ డాసి యవ్వారికిన్ మేలుఁగూర్పంగఁబోవే?
హాత్మా! నినున్ దాసినన్ దక్షిణల్ గొంట లవ్వారికిన్ గర్మ
కృ్మలనం బాచరింపంగఁగాదే? దయాసింధు! నీయాజ్ఞలావింత
నంట! నీపల్కులా వేదవాక్యంబులా దేవ! నీయాశ్రయంబొందు
జీవి యేదేనియున్ మేలుఁబొందున్ గదే! అప్ప! యాకప్ప నే
కా నే నెద్దు నేన్ మేకనేన్ బ్రేమఁగాపాడవే? నీకరస్పర్శ సర్వార్థ
ముల్ గూర్చు, నీచూపులే యాపదల్ వాపు నీడాధునిన్ వెల్గుభస్మంబు
డ్యంబులన్ ద్రోలదే? నీదునామ ప్రభావంబగణ్యంబు, నీపల్కు
జ్ఞానసిద్ధిన్ బ్రసాదింపదే? "మంత్ర తంత్రోపదేశంబులన్ లాభ
మేమాను? నీలో వెలుంగొందు వానిన్ గనన్ సర్వమున్ వేద్యమౌ"
ంచు మున్నాడవే? "చక్కనౌరూపముల్ సూచి స్రుక్కంగనీ కేల?
వాని నిర్మించు నాప్రోడచక్కందనం బెంతొ వీక్షింపు" మంచున్
భాషింపవే? "యోర్పు సద్భక్తు లేనాకుఁగానుకల్ సుమీ!"
ంచు మున్ దెల్పవే? స్వామి! నీదివ్యచారిత్రమున్ నామసంకీర్త
ల్ చేయు భాగ్యంబు నీయాంధ్రదేశంబునన్ వ్యాప్తిన్ జేయు
శ్రీనారసింహుండు నీభక్తుఁడా కేశవుండున్ బ్రభూ! బాబూనారా
బం బెట్టి పూజాదులన్ దొల్లిఁగావించిరో దేవ! యీ స్వల్పునిన్
కరఁగాఁబిల్చి నీపాదసద్భక్తి గల్పించి, నీకబ్బముల్ పల్కనాజ్ఞన్
బ్రాసాదించి యీదీనునిత్యంబునున్ గంటికిన్ రెప్పచందంబునన్
గానవే? యెప్పుడేమాత్రమే తీరునన్ సాయమున్ గూర్పనౌనట్లుఁ
గావింపవే? నిన్ను సేవించు నీవానిగేహంబునన్ దిండికిన్ గుడ్డకున్

లోటు లేదంచు మున్బల్కు నీవాక్యముల్ "సత్యమా! సత్యమా! సత్యమా!" యంచు మున్నెట్టులన్ బల్కు నీవాక్యముల్ రుజాటంగ నీడాక్కడే చాలునయ్యా! సమస్తాపరాధంబులన్ సైచి యీ నీదుబిడ్డన్ గృపాళుండవై ప్రోచుచున్ జిత్తసంశుద్ధి గల్పించి నీనామసంకీర్తనల్ సేయు భాగ్యంబుఁ జేకూర్పవే! నీదు సేవాపరాసక్తిఁ గల్పింపవే సర్వభూతంబులన్ నిన్ను వీక్షించుబుద్ధిన్ బ్రసాదింపవే! నీదుసూక్తుల్ సదా సంస్మరింపన్ దలంపీయవే! సత్యమార్గంబునన్ బోవు భాగ్యంబు గల్పింపవే! నీయెడన్ విస్మృతిన్ గల్గనీయకే "సాయి! శ్రీసాయి!" యంచున్ సదానాల్కపై నీద్వయిన్ వర్తిలన్ జేయవే! తల్లి యుందం డ్రియున్ దైవమున్ దేశికుండర్థమున్ సర్వమున్ నీవయై త్రోవఁ జూపంగదే! ద్వారకామాయివాసా! శ్రితార్తిప్రణాశా! సదా చిద్విలాసా! గురూత్తంస! శ్రీసాయి! శ్రీసాయినాథా! దయాసింధు! సాయిప్రభూ! సాయివిశ్వేశ్వరా! సాయిరామ ప్రభూ! సాయి శ్రీకృష్ణ! శ్రీమారుతీసాయి! శ్రీదత్తసాయీ! సమర్థా! గురూ! సాయి శ్రీసాయిబాబా! చిదానంద! సాయీశ! తుభ్యం నమస్తే! నమస్తే! నమస్తే నమః

శ్రీసాయీదండకము - సమాప్తము.

శ్రీసాయీ నాథార్పణమస్తు.

---

## ప్రార్థన:- శరణాగతి

శ్రీసాయి సద్గురూ! చిన్మయాకార
వాసుదేవ! శ్రితభక్తమందార!
జననమరణరూప సంసారఘోర
వనధిఁగూలితినింకఁ బారముఁజేర
నీపదాంబుజ భక్తినిష్ఠపోతంబు

ప్రాపుఁగూర్పవె సాయిబాబా! సతంబు.
వివిధవిషయము లన్వేషించివానఁ
దవులునింద్రియములఁ దగఁద్రిప్పిలోనఁ
బొలుచు పరాత్మాభి ముఖముఁగావింపు
తెలివి నాత్మానుభూతినిఁ బ్రసాదింపు.
సుతుఁడేని సతియేని సుహృదుండునేని
మృతివేళనెవరుఁ జేయిడరు సుంతేని,
మోక్షసౌఖ్యముల ప్రాపునుగూర్తువీవ
అక్షీణ కరుణా కటాక్ష! శ్రీదేవ!
వాదోపవాదముల్ పాపవర్తనలు
నేదింపు స్వార్థ ప్రవృత్తకార్యములు
నాలుకనీదివ్య నామద్వయమ్ము
రేలుబవళ్ళు స్మరింపఁగానిమ్ము.
తలఁపులనెల్ల చౌదవులఁబోనడపి
పలుగృహధనధాన్య వాంఛలఁగెడపి
దేహ విస్మృతిఁగూర్చి ధృతిబుద్ధులిడుము
మోహబంధముల నిర్మూలింపు చిరము.
సాయి! నీనామ సంస్మరణంబునిమ్ము
మాయయానితరంబు మఱచిపోనిమ్ము.
మతిచంచలత్వంబు మాయింపుసామి!
ధృతిశాంతి విమలభక్తినిఁ గూర్చియోమి.
సామి! నీప్రేమవీక్షణ దీప్తిచెలఁగ
నామోహ తమసమంతయుఁ బాయువేగఁ,
బోనుపుగనేతొంటి పుట్టువులయందుఁ
బొనరించితినొ మెట్టి పున్నెంబు, లిందు
ననఘ! నీలీలాకథా మృతంబానఁ

గనినాడ, మెలకువఁ గంటినీమేన
సాయి! నీపదభక్తి, సాయి! నీసేవఁ
బాయనీయకు సత్కృపామేయభావ!
శ్రీసాయీ నాథార్పణమస్తు.

## హారతి

శ్రీరామణీయక షిర్డివిహారా! శ్రితజనమందార!
ద్వారకామాయీ బాబాసాయీ! భవభయపరిహార! ॥శ్రీరామ॥ 1

హారతి కర్పూర హారతి మంగళ హారతి నర్పింతు
కారుణ్యమున జీవగణములఁ బ్రోతువు కరములఁజోడింతు ॥ 2

నీబిడ్డలముమేము నీపాదరజమున నిశ్చింతగ్రా లెదము
బాబా! యాసలపాల్పడఁజేయక పరమపదంబిడుము ॥ 3

ఎవరెవ రెటులాశ్రయింతురో వారలనీవటు లేలుదువు
వివరింపనీశక్తి విస్తృతాద్భుతము విశ్వైకబంధుడవు ॥ 4

నీనామపోతంబు నిశ్చయముగ భవ నీరధిదాటించు
దీనజనంబుల దిక్కువు సాయీ దేవా! కరుణించు ॥ 5

సగుణబ్రహ్మంబుగ జగతినిఁబొడమితిసాయి! శ్రీహరి వీవు,
అగణితనిగమాగమాదిశాస్త్రములు సత్యమునిన్నెఱుఁగలేవు ॥ 6

శరణాగత దీనసంరక్షకుఁడవను శపథము నిలఁబెట్టుము.
పరమేశ! శ్రీసాయి! వరదాభయకరముఁ బఱపినన్ జేపట్టుము. ॥ 7

నీదివ్యపదసేవ నిరుపమ భాగ్యమ్ము నిరతంబు మాకీయుము
సాదరముగ మానుమచాతకమున్ సాయిజలదాంబు లానింపుము. ॥ 8

నీరాజనంబిదె నీకిత్తుశ్రీసాయీ! నిఖలజగదాధార!
ద్వారకమాయీ భవనవిహార! భవభయపరిహార! ॥శ్రీరామ॥

---

## స్వ బో ధ

పడదిపి ఆదితాళము

ఎఱుఁగలేరురా ! బాబా మర్మం - బెంతవారలేని,
మా బాబాతత్త్వం - బెంతవారు గాని॥ ఎఱుఁగ॥

కొందఱు కపటిగఁ - గొందఱు వెఱ్ఱిగ
పామరుఁడుఁగ - వదరిరిరా! ఎఱుగ॥

కొందఱు లోభిగఁ - గొందఱు భోగిగ
జ్ఞానియనుచుఁ గొం - దరు దలచిరిరా. ఎఱుగ॥

కొందఱు యోగిగ - కొందఱు త్యాగిగఁ
గొందఱు సాదను - కొందురురా ! ఎఱుఁగ॥

కొందఱు గురుఁడు స - ద్గురుఁడని కొందఱు
కొందఱీశుఁ డను - కొందురురా ! ఎఱుఁగ॥

శ్రీ సాయిప్రభు - సిద్ధస్థితి నే
కొందఱో సత్యము - గుర్తించిరిరా ! ఎఱుఁ॥

ఎవరెవ రేగతి - నెంతురో యా యా
ఫల మవ్వారికిఁ గలుగునురా! ఎఱుఁగ॥

ఇందఱ పలుకుల - నెంచి భ్రమింపక
హితమతి హనుమా ! ఏగుమురా !
సత్కృతమతి హనుమా! - ఏగుమురా॥ ఎఱుఁగ॥

## అంకితం

దొర! నీవ యాత్మ, పీ ధునియే మనంబు
పరిజనుల్ ప్రాణముల్ - వపువే గృహంబు
కల విషయోప భోగములె నీపూజ;
తెలియ నిద్రయ - సమాధిస్థితి రాజ!

పలు ప్రదక్షిణలు శుభాస్పద ప్రదక్షిణలు
పలికెడి పలుకులే భవ్య సంస్తుతులు
నెగడు నే నొనరించు నిఖిల కర్మంబు
లగు సాయి! నీదు సమారాధనంబు.

నేను కృతకృత్యుఁడను-ధన్యుఁడేన యగుదు,
హిత సముద్ధృతిఁ గనిరి నా పితరులెల్ల
సాయినాథుండు నిజభక్త సహితుఁడగుచుఁ
జేరి నా కుటీరమున వసించు కతన.

జలనిధి జలములఁగొని యా
జలనిధికిన్ దర్పణం బొసంగునటుల నీ
పలికించిన పలుకులఁ గృతిఁ
బలికి సమర్పింతు, సాయిబాబా! కొనవే!

శ్రీసమర్థ సచ్చిదానందసద్గురు శ్రీసాయిబాబా మహారాజునకు
జై! జై! జై!

శ్రీ సాయిబాబా పూజాస్తవములు
సర్వము, సంపూర్ణము.

ఓమ్ శ్రీసాయిప్రసన్న ! శ్రీ సాయి సమర్థ!

శ్రీ సాయినాథార్పణమస్తు
ఓమ్ తత్ సత్

# సవరణ

| పుట | పంక్తి | ముద్రితము | సవరణ |
|---|---|---|---|
| ౧౭ | 7 | యీతడు | యీతని |
| ౧౮ | 1 | కాపాడు | కాపాడ |
| ,, | 4 | సుభాషితము | సుభాషితంబు |
| ౧౯ | 4 | చులుకు | చుఱుకు |
| ,, | 13 | గడించిడ | గడించిన |
| ౨౦ | 3 | పాత్రుడు | పాత్రులు |
| ,, | 5 | మచితము | నుచితము |
| ,, | 14 | లేదో యఱుంగ; | లేదాయెఱుంగ; |
| 1 | 22 | నివాన | నివాస |
| 13 | 7 | కొల్చుదును | కొల్చుదును. |
| 14 | 1 | యదును | యుదును. |
| ,, | 3 | వినఁడు | వినండు |
| 15 | 22 | మానంబు | మానంబు. |
| 28 | 11 | సేశించెడి | సేవించెడి |
| 34 | 9 | నాశనం | నాశముం |
| ,, | 15 | శ్రౌతి | శ్రౌత |
| 35 | 4 | ప్రాపిడనె | ప్రాపిడెనె |
| ,, | 22 | ప్రదర్శింపరే? | ప్రదర్శింపవే ? |
| 40 | 10 | డెట్లు నా | డెట్లు సా |
| ,, | 16 | జనంబుల | జగంబుల |
| 43 | 15 | వహింతు, నది | వహింతు, వది |
| 44 | 9 | నొరలు | నొరులు |
| 46 | 17 | మ్మంచునె | మ్మంచునే |

| పుట | పంక్తి | ముద్రితము | సవరణ |
|---|---|---|---|
| 47 | 17 | కొంటన్ | కొంటల్ |
| 48 | 17 | థృతి | ధృతి |
| 49 | 11 | యంచుఁ గిం | యంచుఁ గ్రిం |
| ,, | 15 | ముచ్చట రాడెదవ ? | ముచ్చటాడె దవ ? |
| ,, | 16 | నాధప్ర. ! | నాధప్రభూ ! |
| 56 | 2 | వనసముల్ | వసనముల్ |
| 57 | 12 | పున్నాగ | పున్నాగ |
| ,, | 15 | పాపని | పావని |
| 59 | 3 | ప్రదక్షిణము | ప్రదక్షిణ |
| 60 | 35 వ నామముగ "శ్రీ ఆనందదాయనమః" చేర్చుము. | | |
| 61 | 14 (2వ లైను) | నేమః | నేనమః |
| 62 | 4 | స్యాదనా | స్వాదనా |
| ,, | 13 | నీవంచు | వీవంచు |
| ,, | 21 | లెన్నిట | లెన్నింట |
| 63 | 21 | బాబూనారా | బాబునారా |
| ,, | 24 | బ్రాసాదించి | బ్రసాదించి |
| 64 | 1 | నత్యమా | సత్యమా |
| ,, | 4 | నామసకకీర్తనల్ | నామసంకీర్తనల్ |
| ,, | 9 | వీద్వయిన్ | నీద్వయిన్ |
| 65 | 14 | చాదవుల | దాదవుల |
| 66 | 6 | ద్వారకామూయీ | ద్వారకామాయీ |
| ,, | 12 | విశ్షైక | విశ్వైక |
| ,, | 17 | శవధము | శపధము |
| 68 | 6 | వాపితరు | నాపితరు. |

—o—

# ఈ రచయితచే రచింపబడి పునర్ముద్రణ కావలసిన గ్రంథములు

1. శ్రీ సాయినాథ బోధామృతము
2. శ్రీ సాయి మననము
3. శ్రీ సాయి కరుణ
4. శ్రీ సాయి విజయము (జంగమకథ)
5. శ్రీ సాయి ప్రేమకిరణములు
6. శ్రీ సాయి గీత
7. శ్రీకృష్ణకర్ణామృతము (శ్రీ లీలాశుక సంస్కృత కృతికి అనువాదము)
8. శ్రీ ప్రబోధ సుధాకరము (శ్రీ శంకర భగవత్పాద రచితము శ్లోకములు_తెనుగు పద్యములు)
9. శ్రీనివాస దయా శతకము
10. శ్రీ ప్రేమామృతము (నారద భక్తిసూత్రములకు వ్యాఖ్య)
11. శ్రీ పుండరీక చరితము